విశ్వవిఖ్యాత నటసార్వభౌమ **యన్.టి.రామారావు** సమర్పించు

**శ్రీ భాస్కర చిత్ర** వారి

# మేలుకొలుపు



# మోపెడ్

ఇది సరికొత్తదైనందువల్లనో లేక చూపులకు విచిత్రంగా వున్నందు వల్లనే! కొందరు దీనిని చూచినప్పుడల్లా విచిత్రంగా వుందని తమాషాగా పరిహసించి హాస్యాస్పదంగా నవ్వుతుంటారు. ఇది మధ్యతరగతి వాహనం కావటం మరో విశేషంగావచ్చు.
ఇది మోటార్ సైకిలూ కాదు, సైకిలూ కాదు. మరేదైతేనేం మోపెడ్ చాలా ఆదాయకరమైనదీ, సౌకర్యమైనదీ.
దీనిని మరోలా చూచేందుకు ప్రయత్నించండి మీకు మద్రాసు, తిరుపతుల మధ్యదూరం తెలుసుగా. సుమారుగా 160 కి. మీ.

## –పూర్తిగా అపార్థం చేసుకోబడిన వాహనం.

మోపెడ్ లీటరు పెట్రోలుకు 60 కి. మీ. పయనించగలదు. రానుపోను ప్రయాణానికి 5.5 లీటర్ల పెట్రోలు చాలు. అంటే రు. 18ల ఖర్చుతో మీ రానుపోను ప్రయాణం సుఖవంతం కాగలదన్నమాట. మరి ఆదాయానికి మోపెడ్‌కు సాటి వేరొకటి లేదనేందుకు సందేహం లేదుగదా?
ఇక సౌకర్యం గురించి అంటారా. ఒకసారి మోపెడ్‌ను మీరు పొందివుంటే, ప్రయాణానికి ఇదెంత సహాయకారో అనుభవపూర్వకంగా మీకే అవగాహనకాగలదు. ఏట్టి వేళలలోనైనా, ఎట్టి ప్రదేశానికైనా వెళ్ళవలసిన సందర్భంలో మీకై మీ స్వంత వాహనం వేచివుండగలదు బస్సులుకాని, ఆటోరిక్షాలుకాని, టాక్సీలుకాని ఏవీ అవశ్యంలేదు. కేవలం మీ స్వంత మోపెడ్ మీ అధీనంలోనేవుంది. రోడ్లపై సాఫీగా పయనించుటకు అనువైన చక్కని సాధనం.
మిమ్ము చూచి నవ్వి, పరిహసించేవారి మాటంటారా, వారిని లక్ష్యం చేయకండి. ముఖ్యంగా వారు తప్పుడు కారణాలకై పరిహసించుతున్నారనేది మీకే తెలుసుగదా! మరి ఇదే వ్యక్తులు వారికి పరిస్థితులు సానుకూలంగా వున్నప్పుడు చడీ చప్పుడు లేకుండా ఒక మోపెడ్‌ను కొంటారని మీకే తెలుసుగదా.
ఒక లీటరు పెట్రోలు రు. 3.29 లు, కాలాను గుణంగా సరైనదేగదా?



## మయూరం మోపెడ్ –యజమాని సమస్యను పరిష్కారం చేయగలదు!



FDS TML 2623A TEL

**తమిళనాడు మోపెడ్స్ లిమిటెడ్**
(తమిళనాడు స్మాల్ ఇండస్ట్రీస్ కార్పొరేషన్ లిమ్., వారి ఒక ఉప సంస్థ)
ఇండస్ట్రియల్ ఎస్టేట్, గిండీ, మద్రాసు 600 032.

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938-1972]

శుక్రవారం : 13-1-'78
పింగళనామ సం. పుష్య శు. పంచమి

*సంపుటము 71 : సంచిక 17*

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు 41-60
ఆరు మాసాల చందా రు 20-80
విడిప్రతి వెల 75 పైసలు

ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ - 520 003


## విషయానుక్రమణిక

# ఉత్తరాలు

## అట్టమీద బొమ్మ

ది. 23—12—77న కవిత ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రసచిత్రవారపత్రిక మాకెంతో నచ్చింది. ఎప్పుడూ సినీతారలవే కాకుండా మధ్యమధ్య నూతన నటుల ముఖచిత్రాలు వేస్తున్నందుకు అభినందనీయులు. చిన్న సీరియల్ పి. ఎ. హిమబిందు ఆదిలోనే మమ్మల్ని ఆకర్షించుకుంది. పులికంటి కృష్ణారెడ్డిగారి భూతవైద్యుడు ఒక వెరైటీ. మధురస్మృతి బాగుంది.

అడెపు నరసింహారావు (ఇల్లెందు).

## కథలు

23—12 -77వ తేదీ కవిత ముఖచిత్రం వెలువడిన ఆంధ్రసచిత్రవారపత్రిక చూడ ముచ్చటగా ఉంది.

కథలలో మధురస్మృతి కథ చాల బాగుంది. రచయిత్రి గారికి మా అభినందనలు. పి. ఎ. హిమబిందు సీరియల్ మొదట్లోనే మమ్మల్ని అమితంగా ఆకర్షించింది. వచ్చేవారం పత్రిక ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూస్తున్నాము.

అల్లిమల్ల రామారావు (కలకత్తా)

*   *   *

23—12—77 నాటి మా అభిమాన ఆంధ్ర సచిత్ర వారపత్రికపై నటి కవిత ముఖచిత్రం అందాన్నేకాక విందుదనాన్ని కూడా ఇచ్చింది. కథలలో మధురస్మృతి మధురముగా ఉన్నది. సినిమాశీర్షిక లేనిలోటును జి. వి. జి. పేజీ తీర్చింది. సిరాజ్ గారి వైస్కోపు బాతాఖానీ బాగుంది.

గంటా ఉమాశంకర్‌రెడ్డి, గంటా గీతాదేవిరెడ్డి,
కనిరెడ్డి కమలా (బరంపురం)

## సీరియల్

పి. ఏ. హిమబిందుగారు వాళ్ళ ఆఫీసులో వారినే గాదు అందర్నీ మతిపోయేట్లు చేసేశారు. ఇలాంటి అందాలభామ మా ఆఫీసులో లేకపోయిందే అన్నబాధత పెట్టు ఒకసారి చూస్తే చాలనిపించేంత ముచ్చటగా వుంది. ఇంత గొప్ప యువతి హిమబిందు గారికీ, ఆమెని సృష్టించిన లలితాదేవిగారికీ మా హార్దికాభినందనలు.

శ్రీమతి కవుసల్య, రమాకాంత్ (విజయవాడ)

•   •   •

23—12—77 తేది సంచికలో జీవనపోరాటంలో ఆశలఆరాటం సీరియలు రచయిత తన విద్యా పరిష్కార ప్రభావాన్ని చాలా బాగా తెలియజేశారు? నేటివిద్యావిధాన వ్యూహాలకి ఈ సీరియల్ దర్పణంగా వెలుగొందిన రచయితకు మా ధన్యవాదాలు తెలియజేయండి?

ఎస్. పి. చంద్ర (బొమ్మిరెడ్డిపల్లి)

(50వ పేజీ చూడండి)













**ప్రతి రాత్రిలాగే హాస్టల్ రూములకేసి వార్డెన్ చెకింగ్ కొచ్చే ఆ తొమ్మిది గంటల ప్రాంతంలో —**
**అదే పనిగ గది తలుపుల పైని చప్పుడయితే —**
**ఆ వొచ్చింది వార్డెనే అనుకుని హడలిపోయేరు లోపలున్న కుర్రాళ్లు**

# అమ్మాయి ఫోటో

కాసల నాగభూషణం



ఆడుతోన్న పేకాటని అప్పటికప్పుడే కట్టేసి చేతుల్లోని పేకముక్కల్ని ఎక్కడి వక్కడ దిళ్లకింద సర్దేసి పుస్తకాలు పట్టుక్కూచున్నారు బుద్ధిగా. వెంటనే వినిపించే వార్డెన్ గొంతుక కోసం ఎదురు చూస్తున్నారు బెరుగ్గా.

అప్పుడు వాళ్లనుకున్నట్టే —

ఒక్క నిమిషం వ్యవధిలో —

అవతల్నుంచీ అతని గొంతు వినిపించలేదు గాని మళ్ళీ తలుపులు తట్టిన చప్పుడు మాత్రం అయింది.

"అయితే లోపలికి చూడంది గాని వెళ్లడన్నమాట గురుడు" అనుకుంటూ, ఇక లీయక తప్పదన్నట్టు హెచ్చరికగా అందరి వంకా చూశేడు బాబు. చూసి, పట్టుకున్న పుస్తకాన్ని ఎడంచేతిలోకి మార్చి చదువుతూ ఆపేసి నట్టనిపించేలా అందులో ఏదో ఓ పేజీ లోకి చూపుడు వేలిని చేర్చి వెళ్లేడు గుమ్మం వేపు వెళ్లి గొళ్ళెంమీద చెయ్యి వేశేడు. మళ్ళీ వెనక్కి తిరిగి కర్టెన్ తొలిగించే ముందు స్టేజిమీది నటులంతా ఎవరి పొజిషన్లలో వాళ్ళున్నారా లేరా అని సరిచూసే షేక్‌స్పియర్‌లా తను పున్నాడని అనుకుంటూ (అతని పేరు మీదుగా చెలామణీ అయ్యే నాటకాలన్నీ అసలు షేక్స్‌పియర్ రాసినవి కావనీ, అతను అక్కడెక్కడో నాటకాల కంపెనీలో కర్టెన్లు లాగుతోండే వాడనీ వాదించేడు వాళ్ల లెక్చరర్ బువుడు— సారీ - గురుడు వాళ్లనోమారు చూసి తీసేశేడు గొళ్ళెం.

అంత హంగామాచేసి కుర్రాళ్లంతా, చేసిన తప్పు కళ్ళకెదుట కనిపించకున్నా కనిపించే ఆ తప్పు చేసేమన్న కాంప్లెక్స్‌ని ముఖంమీదికి తెచ్చుకున్న సీరియస్‌నెస్‌లో దాచేసి జిరాఫీలా మెడలు చాపి తిన్నగా తెరుచుకున్న ఆ తలుపులవేపు చూస్తే... చూస్తే.

తీరా వాళ్ళకి కనిపించినవాడు నల్లని పొంటువాడు, నలనల్లని పువ్వుల తెల్ల షర్టువాడల్లన రేగిపోయి ముఖమంతట వ్రేలెడి క్రాపువాడు — మూడు పూవులారు కాయలన్నట్టుగా మూడేళ్ల డిగ్రీ కోర్సుని ఆరేళు కాకున్నా ఆరుమార్లుగా పరీక్షలు రాసి ఆరిపోయే యూనివర్శిటీ ఖ్యాతిని [illegible]ంగా వెలగబెట్టినవాడు. వాడు ఏకైక జీవుడు — ధనంజయుడు!

కాలేజీ తెరిచి వారం రోజులవుతోన్నా రివాజు తప్పక అన్నినాళ్లూ మేనమామ గారింట్లోనే గడిపి అక్కడి కసిగందని కాయగూరలు, కల్తీలేని పాలూ పెరుగు, కంటికింపైన పచ్చని పొలాలు, మామ కొడుకులూ మరదళ్ళతో హాయిగా అయ్యే కాలక్షేపం, ఆరుబయట రాత్రుళ్ళు కళ్లలోకి జారి వెన్నెలకి మత్తే కలల్లో కరిగిపోయే మంచి నిద్రా—వీటి నన్నీటినీ వొదిలి రాలేక, రాలేక ఇకతప్పక ఎల్లాగో వొచ్చేడు కాలేజీకి.

అతన్ని చూడ్డంతోటే వొచ్చేడన్న సంతోషంకన్నా అంత గల్లంతుని సృష్టించేడన్న కోపమే ఎక్కువైంది బాబుకి.

"ఒక్కమారు గొంతిచ్చి చావక ఎంత గొడవ చేసేవురా వెధవా!" అంటూనే అతని చేతిలోని సూట్‌కేస్‌ని అందుకున్నాడు. కుక్కిన పేనుల్లా లోపల కూచున్న తక్కిన కథానాయకులంతా పేకముక్కలకిమల్లే పుస్తకాలని గిరాటేసి లేచేరు ఫ్రీగా.

"ఏరా కింగ్‌లా ఇంతాలస్యంగానా రావడం అవతల రెమ్మీలో పాయింట్లలాగా ఆప్సెంటయిన రోజులు పెరిగిపోతోంటే?" అంట్లూ పలకరింపుగా మందలించాడో జోకరు. అంటే పేకాట్లో జోకర్ అని కాదు అర్ధం— జోకులు దించేవాడని. అసలు పేరు అచ్యుతరావు.

లోపలికొచ్చేడు ధనంజయ. వెనకాలే రిక్షావాలా వొచ్చి ఓ లెదర్ కేసూ, బెడ్డింగూ వుంచి వెళ్లేడు.

"ఏరా మామగారి వూరెళ్ళి మర్చి పోయావా మమ్మల్ని?" అన్నాడో మధ్య తరగతి మానవుడు. మామగారి వూరంటే మరధలికి మరో పేరు ఇంతకీ ఈ మాటని అడిగినతని పేరు మాత్రం ప్రభాకరం.

"మిమ్మల్ని మరిచినా మన పేకముక్కల్ని మాత్రం మరవన్నేరా నాయనా!" అన్నాడు ధనంజయ లుంగీ చుట్టుకుని బాత్‌రూం వేపు వెళుతూ

"తినడానికేమైనా తెచ్చేడో లేదో మన వాడు" సూట్‌కేస్ తెరిచి ఘుమఘుమలాడే కారంపప్పు చేతపుచ్చుకున్నాడు. ధనంజయ పూర్నించి వొస్తున్నాడూ అంటే, తక్కిన వాళ్లకంటే అతనికి ఇదిగో ఇల్లాంటివాటి మీదే ధ్యాస ఎక్కువ అందరికీ పంచిపెట్టి ముందుగా కరకరలాడించడం తనే మొద లెట్టేడు ప్రభాకర్.

సోప్ తెచ్చి అల్మయిరాలో వుంచేడు ధనంజయ. టవల్‌తో మొహం ఒత్తు కుంటూ డబుల్‌కాట్‌మీద కూచున్నవాళ్ళకి దగ్గరగా కుర్చీ లాక్కుని కూచున్నాడు.

అంతసేపూ కిక్కురుమనకుండా వుండీ లేనట్టే వూరుకున్న రవీంద్ర అప్పుడడిగేడు అతన్ని— ఆలస్యంగానయినా అసలు విష యాన్ని "ఏరా అబ్బాయ్! ఎల్లా సాగింది ప్రయాణం?" అని.

కుర్చీలోనే కూచుని, కిటికీలో వున్న అద్దంలో మొహం చూసి తల దువ్వు కుంటోన్న ధనంజయకి రవీంద్ర అడిగిన ప్రశ్నతో ఆ రోజుటి తన అనుభవం గుర్తొచ్చి, దాని తాలూకు ఆనందం నవ్వుగా మారి పెదాలమీదుగా సమాధానంలా జాలు వారింది. అతనన్నాడు తల దువ్వుకుంటూనే "నా ప్రయాణం ఈమారు దివ్యంగా జరి గిందిరా రవీ! ఉత్తరం రాస్తూ 'విష్ యు ఏ హేపీ జర్నీ' అని నువ్వాశించింది నిజమై నందుకు విధిగా నీకు నా థ్యాంక్స్ చెప్ప కోవాలి. రేపటికి 'బృందావన్'లో స్పెషల్ స్వీట్ తినిపిస్తాన్నీకు" దువ్వుకోడంముగించి దువ్వెన పడేసేడు ధనంజయ.

"ఏమిటిగురో కథ? కొంపదీసి కలర్ ఫుల్ ఫిగరేదయినా కంపెనీ ఇచ్చిందా ఏమిటి నీకు జర్నీలో?" అడిగేడు అచ్యుతరావు కూజాలోంచి నీళ్లొంపుకుంటూ.

"అక్షరాలా అదే జరిగిందిగా బ్రదర్! ఎంతగా ఎదురుచూస్తాన్సి, ఎదురు చూసి వేటాడినా ఇన్నాళ్ళూ ఒక్క చీర కొంగయినా తగిలిందికాదు బస్సుల్లో. కాని ఈమారు మాత్రం నా పంట పండింది. నా సీటు పక్కనే ఓ బ్యూటీ క్వీన్ కూచుంది చీక్సీల మార్పిళ్ళు, పలకరింపులు, ఆషామాషీ కబుర్లు, అడ్రస్ కనుక్కోడాలూ, ఆగిన చోట హోటల్ టిఫిన్లూ... ఓహ్...ఒక్క టేమిటి? బోర్ అనేమాటే అనిపించ లేదు. నాకు గూడూరువరకూ. అయినా నా దురదృష్టం – అక్కడికి దగ్గరేనట ఏదో వాళ్ల బంధువులవూరు. దిగేసింది అక్కడే" చెప్పడాన్ని ఆనందంగా మొదలెట్టి ఇల్లా వాపోతూ విషాదంలో ముగించేడు ధనంజయ

"ఓరి జయుడూ! నిజమా నువ్వు చెప్పిందంతా?" విని నోరు వెళ్లబెట్టేడు బాబు.

"ఆఁ... ఏ డే దో కోస్తున్నాళ్లేవోయ్ కోతలు." నమ్మలేనట్టు తేలిగ్గా తీసిపారే సేడు ప్రభాకర్. ఆ అవడంలో ధనంజయకి ఎదురయిన అనుభవంమీది అనుమానంకన్నా "ఇల్లా జరిగుండకపోతే బావుణ్ను" అనే అసూయతోడి ఆకాంక్ష ధ్వనించింది.

"ఋజూ చూపెడతాను కావాలంటే" అంటూ లేచి, సూట్‌కేస్ తెరిచి ఓ ఫోటో తీసేడు ధనంజయ. చూపెట్టేడు బాబుకి.

నడుంనుంచి పైకి చాలా క్లోజప్‌లో తీసిన వో అందమైన అమ్మాయి ఫోటో అది పాస్‌పోర్ట్ సైజ్‌లో వుంది. దాని వెనక నాజూకైన అక్షరాలతో రాసిన అడ్రస్‌వుంది

"వాటె లక్కీ యు ఆర్ జయుడూ!" ఆ ఫోటో అందుకుని,అందులోని అమ్మాయిని చూసేడు బాబు వెనక్కి తిప్పి, 'మోహిని' అని రాసివున్న పేరుని పైకి చదివి, 'ఫైన్ నేమ్' అని వో కాంప్లిమెంట్ పారేసి ఫోటో ప్రభాకర్‌కిచ్చేడు. ప్రభాకర్‌నించి అచ్యుత రావుకీ, అతన్నుంచి రవీంద్ర చేతికీవొచ్చి చేరింది ఆ ఫోటో.

అమ్మాయిని చూశేడు రవీంద్ర. ధనం జయ్ మొహంలోకి మార్చిచూసి, అతనితో ఏదో అనబోయి, మానుకుని మళీ చూశాడు ఆమెని. వెలగబోయి మానేసిన ట్యూబ్ లైట్‌లా ఏదోఒకమాట అతని పెదాలమీదే జారిపోయింది వెనక్కి. ఫోటో త్రిప్పి అడ్రస్ చూశేడు. నవ్వుకున్నాడు.

"ఇకనేం? గ్రీన్ సిగ్నల్ ఇచ్చిందన్న మాటే! రాస్తావా వుత్తరాలు?" అడిగేడు రవీంద్ర.

"అదేపని రేపట్నుంచి" అన్నాడు ప్రభాకర్.

"నీకు ఫోటో ఇచ్చిందే మరి నువ్వే మిచ్చావు ఆవిడకి?" అడిగేడు బాబు.

"నా కర్చీఫ్" ఆ నలుగుర్లో తనే హీరో అయ్యేడన్న సెల్ఫ్ ఎడ్మిరేషన్ మెరుస్తోం దతని కళ్ళలో.

"వెరీ గుడ్! హేపీ క్లయిమాక్స్‌తో ముగిసిందీ రోజు. ఇక పడుకుందాం రండి" పక్కలు సద్దుకుని, మేడపైకి వెళ్లేరు ముగ్గురూ – రవీంద్ర మినహాయించి.

"వొస్తానిప్పుడే" అంటూ తనుమాత్రం మిగిలి గదిలో టేబుల్‌లైట్ వేసుకుని కూచున్నాడు రవీంద్ర. ఆ ఫోటో ముందుం చుకుని లెటర్‌పేడ్ అందుకున్నాడు.

"డియర్ మృణాళినీ,

క్షేమంగా చేరేను తిరువతికి అక్కణ్నుంచి నేనొచ్చేప్పుడు "నిన్ను చూడాలంది అమ్మ ర"మ్మంటే రావన్నావు నాతో "నేనే వెళతా" నన్నావు నువ్విప్పుడు విూ అత్తమ్మ దగ్గర వున్నావని తెలిసే ఈ ఉత్తరం కేరాఫ్ అని నాన్నగారి పేరుతోనే రాస్తున్నా. నువ్వక్కడుండడం అప్పుడే నాకెల్లా తెలి సిందా అని ఆశ్చర్యపడకు. బస్సుల్లోనయినా, సినిమా హాల్లలోనయినా నీ అల్లరి మానవనేది ఎల్లాగు తెలిసిన సంగతే నాకు గూడూరు వరకూ ట్రావెల్ చేసి ఓ తారుడబ్బా అబ్బాయికి నువ్విచ్చిన ఫోటో– మొన్న సెల వుల్లోనే తీసిందే– నికే్పంలా ఇప్పుడు నా దగ్గరే వుంది. పేరు మార్చి, వూరు మార్చి,




వాచీవద్దు రేడియో కావాలని, లేకపోతే రేడియోవద్దు స్కూటర్ కావాలనీ అల్లుడు అలకపానుపు ఎక్కితే ఎలాగోలా తీరుస్తాం కాని...

"నాకు మగపిల్లవాడు కావాలంటే మీ అమ్మాయి ఆడపిల్లని కన్నది' అని అలిగి కూర్చుంటే ఎలా ఛావాలే!!!

# హైదరాబాద్ నోట్ బుక్

**శ్రీ దమ్మాలపాటి శేషగిరి శర్మ :**

యదిదం భువనేషు దృశ్యతే
నిఖిలం స్వాత్మతయా విభావయ,
త్యజ భూతిషు నిత్యతాధియం
నచ కాంక్షస్వ మృషాథ నాదికం

ఈ లోకాలలో కనిపించే దానినంతా ఈశ్వరాత్మ్యంగా చూడు. కనబడే భూతులలో నిత్యత్వబుద్ధిని వదలు— అవి నిత్యం అనుకోవద్దు. మాయా ధనాదికం ఆకాంక్షించవద్దు.

శతవత్సర జీవితం నరో
విహితం కర్మ నిరీహయా చరేత్,
అమునైవ పథా చరన్ కదా
స్వశుభం కర్మ ఫలం నవిందతే.

నరుడు నూరేళ్లూ విధివిహితమైన కర్మను నిరీహతో ఆచరించాలి. ఈ మార్గంగా ఆచరిస్తూ వుంటే అతనిని అశుభమయిన కర్మఫలమేమీ అంటదు.

ఇవి ఈశావాస్యోపనిషత్తుకు మిత్రుడు శ్రీ దమ్మాలపాటి శేషగిరిశర్మ సరళ సంస్కృత పద్యానువరణంలోని రెండు పద్యాలు. శేషగిరి శర్మ నైష్ఠికుడు. ఆయన పితృపాదులు శ్రీ వెంకరావుగారు సుప్రసిద్ధ విద్వాంసులు శ్రీ కనుపర్తి మార్కండేయ శర్మగారితో పాటు వైదిక ధర్మప్రచారం చేసిన నైష్ఠికులు. శేషగిరిశర్మ నైష్ఠికత, వారినుంచి సంతరించుకొన్నదే. శేషగిరిది ఇతరులను బాధించని ఇతరులను ఆక్షేపించని సహన ధర్మపరాయణత కనుకనే ఆయన పరివేష మధ్య గతుడయిన సూర్యునిలాగ వుంటాడు. శేషగిరి ఈశావాస్యాన్నే కాక దశోపనిషత్తులను సరళశైలిలో కావ్యాలలాగ రచించడంతోపాటు ఉపనిషన్మతాన్ని అనువంశీకంగానే ఆచరణలో పెట్టినవాడు గనుక పూర్వభాషిత్వం, ఏదడిగినా, ఏది చెప్పదలచినా ఎదుటివాని హృదయకేదారంలో ప్రేమనారులు పోసే చిరునవ్వుతో, చెప్పడం, చెప్పినది స్పష్టంగా, సూటిగా చెప్పడం అలవాటయ్యాయనుకుంటాను. లక్ష్యశుద్ధి కలవాళ్ల పలుకులోని పదిమతాలే అలాంటివి. శేషగిరి లక్ష్యం. ధర్మప్రచారం, సంస్కృతి ప్రచారం. చదివింది సాహిత్యాలంకార శాస్త్రాలయినా, అయనకు వచ్చింది ధర్మప్రచారం, ఇతరా బాధితమైన ఇతరా బాధకమైన సత్పథంలో నడవడం. దాదాపు తరంగా సంస్కృతోపాధ్యాయుడుగా పనిచేశాడు. పెక్కు సభలలో ఆంధ్ర సంస్కృతాలలో సరళ సుందరంగా కమ్మని రాగగంధి పద్యసటసంతో ప్రసంగాలు చేశాడు. శృంగేరి, పుష్పగిరి, కామకోటి సంస్థానాలలో సన్మానాలు పొందాడు. ఇటీవల కాశీలో జరిగిన సార్వభౌమ సంస్కృత ప్రచారాభిరజతోత్సవంలో దక్షిణాపథ సంస్కృత పత్రికల ప్రతినిధిగా పాల్గొన్నాడు. దేశమంతా తిరిగాడు. ఇంతటి కవి, విద్వాంసుడు అయినా, విద్యయొసగును వినయంబు అనే సూక్తికి తార్కాణంగా కనిపించే సజ్జనుడు కుంభగత ప్రదీప కళిక వలె ఉంటాడు. ఉపనిషద్ జ్ఞాన దీపితమైన ఈ కుంభగత ప్రదీపకళిక వెలుగులు కుంభముఖంనుంచి వెలువడి విశాల ప్రపంచానికి వెలుగు వెలార్చుతుందనడంలో సందేహంలేదు. అందులోను ఉపనిషత్తులను యథా మాత్రంగా సంస్కృత పద్యానువాదం, సమగ్రమైనది తొలిసారిగా ఆంధ్రప్రదేశ్ నుంచి వరసారావుపేటనుంచి వెలువడుతున్నందుకు సంతోషిస్తున్నాను. శేషగిరి రచనలోని సరళతను సౌందర్యాన్ని పాఠకులకు మరి రెండు శ్లోకాలు ఉదహరించకుండా ఉండలేక పోతున్నాను. ఇవి కఠోపనిషత్తు అనువాదంలోనివి :

పితరం నరకా ద్విమోక్తు కామః
నచికేతో ప్రజగామ సన్నిధిమ్,
వినయేన కృతాంజలి ర్బభాసే ;
సమకస్మై ప్రదదాసి మామితి.
అధిగత్య యమః స్వమందిరం
జ్వలదగ్ని ప్రతిమం నిరీక్ష్యతమ్
అతిథిః జ్వలనో దహేదనౌ
శమయాంభో భిరితి ప్రబోధితః.

ఇటీవల ఈయన హైదరాబాదులో చాలాచోట్ల ప్రసంగించారు. ఈయన సోదరులు డాక్టర్ దమ్మాలపాటి రామారావు రాష్ట్ర విధాన సభ సభ్యులు,

**విజయానికి జనతా జతనం :**

యాదవులలో ముసలంలాగ కాంగ్రెస్‌లో ముసలం పుట్టి అగ్ర నాయకులు అమీతుమీ తేల్చుకోడానికి సన్నద్ధులయిన సందులో జనతా పార్టీ రాష్ట్రంలో బలపడడానికి ప్రయత్నిస్తున్నది. కేంద్రపార్టీ నాయకులు చంద్రశేఖర్, నానాజిదేశ్‌ముఖ్ రాష్ట్రంలో పర్యటనలు జరుపనున్నారు. రాజీనామా యిచ్చిన మంత్రులు పిడతల రంగారెడ్డి, అనం వెంకటరెడ్డి, టి. చొక్కారావు జనతా పార్టీలో చేరనున్నారు. రాష్ట్ర విధాన సభ ఎన్నికలలో రాష్ట్ర జనతా అధ్యక్షుడు తెన్నేటి విశ్వనాథం పాల్గొనడని ఆయన సన్నిహితులు అంటున్నారు. జనతాలో లోగడ ఏర్పడిన అసంతృప్తి తొలగి పోయిందని, ఎన్నికలలో జనతా విజయావకాశాలు ఎక్కువగా వున్నాయని జనతా పార్టీ వారు అంటున్నారు. కాంగ్రెస్ పార్టీలో చీలికలు వస్తే ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు కాంగ్రెస్‌ను విడనాడడం వుండదని అంటున్నారు.

**ఉపశ్రుతి :**

"ఒక నాటకం జరుగుతూండగా రెండు రంగాలు కాగానే జనం వెళ్ళి పోతున్నారు. "ఏమైనా నాటకం జనాన్ని కదిలించింది చూశారా? అన్నారు మిత్రులు శ్రీ ఇన్నయ్య. "మనుషుల్ని కదలించక పోగా, ఇదా కదలించడం, సమూలంగా? అన్నాడు ఒక పెద్ద మనిషి.

— తిరుమల రామచంద్ర.

## అమ్మాయి ఫోటో

అడ్రస్‌నే అసలు తారుమారుచేసి నువ్వు చేసిన గల్లంతంతా ఎల్లా వుంటుందో ఊహించు కుంటున్నాను. రేపట్నుంచీ ఆ అడ్రస్‌కి పుత్తరాలు రాయడం మొదలెట్టి ఎంతగా 'లాఫింగ్ స్టాక్' అవుతాడో పాపం, మా వాడు బలే కాలక్షేపం ఇకమీదట మాకు ఈ సంగతిని వానికి తప్ప మిగతా మా రూంమేట్స్ ఇద్దరికీ చెప్పెట్టాలి సమయంచూసి.

పోతే—

నువ్వింకెవరికీ ఫోటోలివ్వకు ఎందుకంటే ఇదేదో ఏక్సిడెంటల్‌గా నా చేతికి వొచ్చింది గాని అవి చుట్టి చుట్టి చివరికి నా చేతికే వొస్తాయనే గ్యారంటీ లేదు.

తర్వాత—

వాడిచ్చిన కర్చీఫ్— అది నాదే— దాచి వుంచుకో. ఎగ్జిబిషన్‌లో నే కొన్న కర్చీఫ్‌ని ఇంటికెళ్లబోయి బస్సెక్కుతూ ఎత్తుకోడం మరిచేనని లాక్కున్నాడు నా చేతిలోంచి.

ప్రస్తుతం నువ్వున్న ఇల్లే తొందర్లో మనం వున్న ఇల్లుగా మారాలని కోరుతూ

సెలవు తీసుకోనా ?
యువర్స్ - రవీంద్ర

ఉత్తరం పూర్తిచేసి, లైట్ తీసేసి బెడ్డింగూ ఒ పుస్తకమూ ఎత్తుకొని తాసూ మేడ మీదికెళ్ళేడు రవీంద్ర.

"ఫోటో ఏదీ ?" అని అడిగితే మరునాటి పుదయం "ఈ పుస్తకంలో నే పెట్టినే అయ్యో ! గాలికి కొట్టుకు పోయిందేమో" అని చెప్పాలి ధనం జయకి చివర 'సారీ' చేర్చాలి" అనుకుంట్లూ పడుకున్నాడు.




చిన్న సీరియల్

# పి. ఎ. హిమబిందు

జొన్నలగడ్డ లలితాదేవి

(గత సంచిక తరువాయి)

అందమైన ఆమె రూపానికి వికృతమైన హృదయం. గులాబీని ఆశ్రయించే ముళ్ళలా, మొగలిపూలను చుట్టుకునే మిన్నాగుల్లా ఆమె అందాల రూపానికి భయంకరమైన మనస్సు. ఆమనసులో డాంబికము, దర్పము, ధనగర్వము, సౌందర్య గర్వమూ తప్ప, జాలి, ప్రేమ కరుణఅనేవి అసలు డిక్షనరీలోలేని పదాలు ఆనాడున్న మమకారం ఈనాడు లేదు. తనంటే ఆమెకి విపరీతమైన ద్వేషం. నానాటికీ ఈసడింపు. తూష్ణీభావం అన్నీ అధికమవుతున్నాయేగాని ఆదరణ పూర్వకమైన మాట లేనేలేదు. రాదు కూడా. గదిలో నిశ్శబ్దంగా రోదించాడు శ్రీపతి అతని హృదయంలో రేగే బడబాగ్ని హేలలను ఆర్పివేయగలశక్తి ఎవరికీ లేదు. కాళ్ళు కోల్పోయి, ఉద్యోగం పోయి, సర్వమూ నాశనమై మదిలోరేగే మంటలతో ఆప్యాయతకు ఆదరణకూ నోచుకోని నిక్రుష్టపు బ్రతుకులో ఒక్క ప్రేమ పూరితమైన పలుకుకోసం, ఒక స్వాంతన పరిచే కోమల హస్తంకోసం, పరితపిస్తున్న దౌర్భాగ్య జీవి. ఇసుక రేణువుల్లో మంచినీటి కోసం పరితపిస్తున్న పిపాసార్తుడు.

ఆరోజు ఆదివారం కనుక మ్యాట్నీకి వెళ్ళింది హిమబిందు. ఫ్లాస్కులో కాఫీకూడా పోసి వెళ్ళలేదు టైమయిపోయిందని హడావుడిగా వెళ్ళిపోయింది. ఆగదిలో ఒంటరిగా "రామకృష్ణ పరమహంస, వివేకానందుడు మహాత్మగాంధీ" వంటి మహాపురుషుల జీవిత కథలను చదువుకుంటూ ఆ నాలుగుగోడల మధ్యాబంధింపబడిన ఋషి పుంగవునిలా వున్నాడు శ్రీపతి. అదిలించేవారూ అడిగేవారూ లేరు కనుక గడ్డం మాసిపోయి, సాదా దుస్తుల్లో చిక్కిపోయిన వదనంతో చదువుకుంటున్నాడు. అడుగుల సవ్వడి విని విచిత్రంగా చూశాడు, ఎదురుగ్గా మాధవి! ఆమె చేతిలో రెండు యాపిల్సు. ఆమెని చూసి మరింత విస్మయుపడి "రా మాధవీ!" అన్నాడు ఆహ్వానిస్తూ.

మాధవి కాతన్ని చూడగానే దుఃఖం ఉప్పెనలా వచ్చింది, ఆ రెండు యాపిల్సు అతని చేతిలో వుంచి "ఎలా అయిపోయారు" అంది గద్గదికంగా.

అమాటలకి విషాదంగా నవ్వాడు శ్రీపతి "నేను ఇంకా నీ పూర్వపు జనరల్ మేనేజరునే అనుకుంటున్నావా మాధవీ! ఇప్పుడు నేనెందుకూ కొరగాని, అంటరాని వాడిని."

ఎంత అణచుకుందామనుకున్నా అణగిపోని విషాదం పైకి దర్శనమిస్తూనేవుంది. అది చక్కగా గమనించింది మాధవి. ఆమెలో ఆవేదన సుళ్ళు తిరిగింది. దాదాపతని జీవితమూ అర్థమయింది.

"అబ్బె! ఏమిటా మాటలు: మీరు జనరల్ మేనేజరు కానంత మాత్రాన కాళ్ళు కోల్పోయిన మాత్రాన మనిషి కారని, అంటరాని వారని మీలో మీరే వూహించుకుని యాతన పడటం మంచిది కాదు" అంది కష్టంమీద దుఃఖం అణచుకుంటూ.

అది చూడనే చూశాడు శ్రీపతి ఆమె కనుకొనుకుల్లోని కన్నీటిని చూశాడు.

"మాధవీ: నువ్వు ఏడుస్తున్నావా ?" అన్నాడు ఆశ్చర్యంగా.

ఆమాటతో అందాకా పట్టితు వస్తున్న ధైర్యం జారిపోగా ఒక్కసారి పైకి ఏడ్చేసింది మాధవి.

"భగవంతుడు చాలా నిర్దయుడు శ్రీపతి గారూ: మీవంటి వారికో కలిగించాల్సిన కష్టం కాదు ఇది."

"నేను చేసుకన్న ప్రారబ్ధానికి భగవంతుడిని నెపం పెట్టకు

"కావాలని కాళ్ళు పోగొట్టుకోరు దా ఎవరూ; మరి విధి ఆడిన నాటకం తప్ప మీ చేతులారా ఏం చేసుకున్నారని."






**జరిగినకథ 3** జనరల్‌మేనేజర్ శ్రీపతి పి. ఏ. గా చేరిన హిమబిందు అందం ఆ ఆఫీసులో అలజడి రేపుతుంది. డబ్బు, హోదా, అధికారం అన్నీవున్న శ్రీపతి ఆమెని ఆకర్షిస్తాడు. హిమబిందు శ్రీపతి పెళ్ళి చేసుకుంటారు. కారు ప్రమాదంలో కాళ్ళు, ఉద్యోగం అన్నీ పోగొట్టుకున్న శ్రీపతి అంటే అసహ్యం, ఏవగింపు కల్గుతాయి హిమబిందుకి.

"ఏమయినా కన్నూ, కాలూ కోల్పోయాక జీవించకూడదు మాధవీ!" విరక్తిగా అన్నాడు శ్రీపతి.

"దయచేసి అలాటి మాటలు నా దగ్గర అనకండి." అని "హిమబిందుగారు లేరా!" అంది అటూ ఇటూ చూసి.

"లేదు. సినిమాకి వెళ్ళింది."

"కాఫీ త్రాగారా!"

"లేదు."

"కాచిపెట్టనా!"

అతనికి కాస్త ఆకలిగా తోచినా "ఎందుకులే మాధవీ! నీకంత శ్రమ పైగా ఏది ఎక్కడుందో నీకు తెలియదుగదా! హిమ వచ్చాక పనిమనిషి తెస్తుందిలే!"

"మీకు నేను కాఫీ కలిపివ్వడానికికూడా పనికిరానా!" బాధగా అడిగింది.

"ఛ! అలా ఎందుకనుకున్నావు మాధవీ! నీచేత కాఫీ పెట్టించుకుని త్రాగడానికి అర్హత లేనివాణ్ని నేనే!" కష్టంగా జవాబిచ్చాడు.

మాధవి మాట్లాడకుండా వంటింట్లోకి వెళ్ళి అన్నీ వెతుక్కుని కాఫీ కలిపింది... కప్పులోపోసి తెచ్చి తనే, అతనికి అందించింది.

"మరి నువ్వుకూడా తీసుకో మాధవీ!" అన్నాడు అప్యాయంగా.

"ముందు మీరు త్రాగండి." అంటూ నవ్వి టేబుల్‌పైన వున్న పుస్తకాలు సర్దింది. ఇవన్నీ అతన్ని ఆశ్చర్యంలోనే ముంచివేసాయి. అతి ముభావంగా వుండే మాధవిలో యింత కలుపుగోలుతనమూ, ఇంత ఆప్యాయతా వున్నాయాఅన్నదే అతని ఆశ్చర్యానికి కారణం.

"ఇంక వెడతానండీ :" అంటూ లేచిన మాధవిని చూసి "మళ్ళీ ఎప్పుడు వస్తావు మాధవీ :" అనడిగాడు శ్రీపతి.

"మీభార్యగారేమీ అనుకోరంటే రోజూ రమ్మన్నా వస్తాను." చిరునవ్వుతూ అంది మాధవి.

"ఆవిడకి నా సంగతే కావాలా ! ఉద్యోగం ఇతర వ్యాపకాలు ఆవిడకి చాలా వున్నాయి. మగవాడిలా సంపాదించాలి గదా :" అంటూ నవ్వి "తప్పకుండా రోజూరా :" అంటూ హెచ్చరించాక సెలవు తీసుకుంది మాధవి.

## 5

మర్నాడు మాధవి వచ్చేసరికి హిమబిందు ఇంకా ఆఫీసునించి రానేలేదు. మాధవే కాఫీ కలిపి శ్రీపతిచేత త్రాగించింది. అల్మారాలో ఎదురుగా వున్న రాధా మాధవుల విగ్రహం తన ప్రజంటేషన్ కనిపించింది సర్దుతుంటే అది శ్రీపతి చూసి ఎందుకనో,

"మాధవీ! ఆ రాధా మాధవుల బొమ్మ ఇక్కడికి తీసుకువచ్చి ఈ టేబుల్ పైన వుంచు" అన్నాడు మందహాసం చేస్తూ.

మాధవి ఒకసారి చీరతో తుడిచి "ఈ రోజు ఈ రాధమీద దృష్టి పడిందేమిటి?" అంటూ తెచ్చిపెట్టింది నవ్వుతూ.

ఆ రాధా కృష్ణుల విగ్రహాన్ని, మాధవిని ఒక్క క్షణం తేరిపార చూశాడు శ్రీపతి. రాధ అంత అందంగాను, ఆమె అంత ముగ్ధగాను మాత్రమే కాక రాధ కన్నులలోని అనురాగం కూడా మాధవి కన్నులలో కొట్టవచ్చినట్టు కనిపించింది శ్రీపతికి. ఆనాడు ఆమె ఈ కానుక యిస్తూ అన్నమాట తను జన్మలో మర్చిపోలేదు. ఆనాడు మహాద్భుత సౌందర్యవతియైన హిమబిందు ప్రక్కన వుండగా, మంచి హోదాగల ఉద్యోగము, జీతం, అన్ని హంగులువున్న తనకా క్షణంలో ఈ పేదపిల్ల ఇచ్చిన కానుకలోని ఆంతర్యము వెలిబుచ్చిన భావాల్లోని అర్థము— అవగతం కాకపోయినా, పరిస్థితి తారుమారై దర్జాలు డాబులు అన్నీ కరిగిపోయి, అందాల భార్య మనసులోని కురూప భావాలు బాగా నెత్తికెక్కేక ఈనాడు ఏకాకి అయ్యేసరికి మహా చక్కగా బోధపడుతున్నాయి అన్నీ.

"కాలపురుషుని కరకు హస్తాల్లో ఒక్కోసారి అపకారమూ, మరోసారి ఉపకారము కూడా జరుగుతూనే ఉంటుందిలే" అంటూ మందహాసం చేశాడు శ్రీపతి.

దానికి జవాబేమీ యివ్వలేదు మాధవి.

తాజా యాలకుల
రసముయొక్క
ఘుమఘుమలాడే
వాసనచేరిన చిక్కని
మీగడ, డైరిపాలు,
వెన్న కలసిన
మాధుర్య రుచి





# న్యూట్రిన్
## కార్డిమమ్ క్రీమ్ టాఫీ

CAS NC 11 TE 77



ఒక్కొక్క మిఠాయియందు
ఫలరస పూరిత విందు!




మీగడ పాలు, వెన్న, తాజా యాలకుల
కమ్మదనము, వీటియొక్క గొప్ప కలయిక—
దీనికి పేరు కార్డిమమ్ క్రీమ్ టాఫీ.

న్యూట్రిన్ కన్ఫెక్షనరీ కంపెనీ లిమిటెడ్, చిత్తూరు (ఆం.ప్ర)
హెచ్చరిక : ఈ బొమ్మ న్యూట్రిన్ మిఠాయివారి ట్రేడ్‌మార్కు.

# ధర్మపథం

## గురుశిష్య సంబంధం

తాత్త్విక జ్ఞానాన్ని సంపాదించి, దాని మూలంగా తరించాలనే సంకల్పంతో శిష్యుడు గురువును ఆశ్రయిస్తాడు. అలా ఆశ్రయించినప్పుడు శిష్యునకు గురువుపై ఉత్తమ భక్తిభావం ఉండవలసి ఉన్నది. గురువును సామాన్య మానవునిగా అనుకొనకూడదు. అలా అనుకొంటే ప్రయోజనం ఉండదు. గురువును ఒక దేవతగానే భావించి గౌరవించాలి. ప్రాచీనకాలంలో శిష్యులు

"గురుర్బ్రహ్మ, గురుర్విష్ణుః
గురుర్దేవో మహేశ్వరః,
గురుః సాక్షాత్ పరంబ్రహ్మ
తస్మై శ్రీ గురవే నమః."

అని గురువును గౌరవించి, నమస్కరించేవారు. అప్పటివారు గురువును త్రిమూర్తిస్వరూపుడుగానూ, పరబ్రహ్మస్వరూపుడుగానూ భావించేవారు. అట్టి భావన లేనప్పుడు ఏ ఉపదేశమూ ఫలించదు.

గురువు ఒక వ్యక్తిని శిష్యునిగా స్వీకరించేటప్పుడు, ముందుగా కఠిన పరీక్షలు చేసేవాడు. కొన్ని నెలలపాటు ఆ పరీక్ష జరిగేది. గురువు సంతృప్తి పడినతర్వాతనే శిష్యుడుగా ఉండుటకు అనుమతి లభించేది.

మొదట్లో గురువుపై శిష్యునికి గొప్ప గురి ఉన్నా గురి తప్పిపోయిన వెంటనే ఆ గురూపదేశం వ్యర్థమయిపోతుంది.

ఇద్దరు శిష్యులు ఒక గురువును ఆశ్రయించి శరీరంతోనే స్వర్గానికిపోయే మంత్రాల ఉపదేశం పొందారు. ఆయన వారిద్దరికీ వేరు వేరు మంత్రాలు ఉపదేశించారు. నియమంతో కొంతకాలం జపం చెయ్యగా ఫలసిద్ధి కలిగే సూచనలు కనబడ్డాయి. దీక్షగా వాటిని జపిస్తూవుంటే స్వర్గానికి వెళ్లవచ్చునని గురువు చెప్పాడు. నియమంలోని వ్యత్యాసం వల్ల ఒకరు ముందూ, ఒకరు వెనుకా స్వర్గమార్గం ప్రవేశించారు. దారిలో ఇద్దరూ కలుసుకున్నారు. ఇద్దరూ ఒక్కసారి కాకుండా-ముందు వెనుకలు కావడానికి కారణ మేమిటా? అనే ఆలోచన కలిగింది. గురువు పక్షపాతం చూపి, వేర్వేరు మంత్రాలు ఉపదేశించినట్లు వారిద్దరికీ సందేహం తోచింది. "ఆయన ఇలాంటివారని అనుకోలేదు" అని అనుకున్నారు వారు. వెంటనే వారు మీదినుంచి భూమిపై పడిపోయారు. వారి స్వర్గమార్గం మూసుకుపోయింది.

గురువును దైవంగా భావించినప్పుడే ఆయన ఉపదేశం ఫలిస్తుంది. సామాన్య మానవునిగా తలిస్తే ఏమీ ప్రయోజనం ఉండదు.

*— బులుసు వేంకటరమణయ్య*

---

"ఇంతకీ మీ రేమిటి చదువుతున్నారు?" అంటూ అతని చేతిలో పుస్తకం లాగి చూసింది.

"జ్యూల్స్ వెర్న్‌నవల" "ఎరౌండ్ ది వరల్డ్ ఇన్ ఎయిటీడేస్" ఇది బాగానే వుంటుంది వెనక నేను చదివాను" అంది మందహాసం చేస్తూ.

"నేనూ ఒకసారి చదివాననుకో, ఇప్పుడెలాగా బయట ప్రపంచంలోకి తొంగి చూసే అర్హత అవకాశం లేనేలేవు. కనీసం నాల్గుగోడల మధ్య బంధితుడినైనప్పుడు ఇలాంటివి చదివి నేనూ కూడా సంచారానికి బయలుదేరినట్లే తృప్తి పడవచ్చు." శ్రీపతి మాటలకి "మీరు కావాలని మరికొంత న్యూనత వూహించుకుంటున్నారు ఏం? మీ కెలాగో వీల్ ఛైర్ వుంది. అలా బయటికి రావచ్చు కొన్నాళ్లిలా వస్తూ వుంటే అదే అలవాటయి పోతుంది చివరకి. కాళ్లు లేనంత మాత్రాన జీవితమే వ్యర్థం అనుకోవడం చాలా హాస్యాస్పదంగా వుంది."

"మాధవీ కేవలం కాళ్లు ఒకటే లుప్తం అయి, ఆత్మీయుల ఆదరణ పుష్కలంగా వుంటే బతుకింత సారవిహీనం అనుకోకనే పోదును. కాని అయినవారు అనుకున్న

## పి. ఎ. హిమబిందు

వారందరి చేతా విసర్జింపబడి. స్వంత ఆర్జన అనేది లేక ఇతరుల మీద ఆధారపడవల్సిన దుస్థితిలో పడిన పరభార్యోప జీవిని. తనువు, ప్రాణము బరువుగాను, భారంగానూ వుండక ఎలా వుంటాను చెప్పు." శ్రీపతి గుండెల్లో గూడుకట్టుకున్న ఆవేదన కాస్త కాస్తా బయట పడుతుంటే నిలువునా చలించి పోయింది మాధవి.

"పరిస్థితులు అనుకూలించనప్పుడు ఎంతటి వారినైనా విధి వెక్కిరించవచ్చు. మహావీరు లనిపించుకున్న పాండు నందనులే తమకంటే ఓ మెట్టు దిగువనే వుండే విరాటునికి వూడిగం చేయాల్సివచ్చి అజ్ఞాత వాసులయ్యారు. ఏదో కాలంఖర్మం కలిసిరాక మీ ఆత్మీయులనుకున్న వారు మిమ్మల్ని కాస్త విసర్జించారే అనుకోండి. ఇంక అంతటితో నిరాశచెంది జీవితాన్ని ఎరక సద్వ్యశంచేసుకోనక్కరలేదు. ఆ కాల మహిమ చేతే మీరు దూరంగా నెట్టివేసినవారు దరి చేరవచ్చు. మీకేమీ కాదనుకునేవారు మీ కోసం పరితపిస్తూ మీదరి చేరాలని తహతహలాడవచ్చు" అంది మెల్లగా.

"అలా దరిచేరాలనుకున్న వారెవరైనా వున్నారా? నువ్వువూరికే వూరిస్తున్నావా."

"నేను వూరించినంత మాత్రాన మీరు వూరిపోతే ఇంక నాకు కావల్సిందేముంది?" కొంటెగా అంది మాధవి.

"మాధవి కబుర్లు బాగానే చెప్పగలదు. అసలు విషయం దాచిపెట్టి."

మాధవి కనీ కనబడని చిరునవ్వు విసిరి పోనీ నేను దాచానే అనుకోండి మీరు తెలివైనవారు. గ్రహించవచ్చు గదా: కాస్త ఊహిస్తే కష్టం ఏమి లేదు." అంటూ ఓ కొంటె జవాబిచ్చింది.

ఇంతలో హైహీల్స్ టకటకలాడించుకుంటూ హిమబిందు వచ్చి పెద్దగా నవ్వుకుంటున్న శ్రీపతిని, మాధవిని చూసి ఆశ్చర్యపడింది మనసులో. టేబుల్ పైనవున్న కాఫీ కప్పులూ ఆమెదృష్టినుంచి తప్పించుకోలేదు.

"మీ కాఫీలయ్యాయేమిటి?" అంటూ మళ్లీ దానికి జవాబేమీ ఆశించకుండానే తన గదిలోకి వెళ్లిపోయింది హిమబిందు.

"ఇంక నేను వెళ్లిరానా:"

"అప్పుడేనా కస్సేపుండు మాధవీ".

"అయితే వుండండి వంటలో ఏమన్నా సాయంకావాలేమో చూసివస్తాను." అంటూ

వంటగదిలోకి వెళ్ళింది మాధవి.

హిమబిందు మాధవిని చూస్తూనే "కాస్త ఈపూట వంటచేసిపెడుదూ నాకు మాడు పోటుగావుంది" అంది మాధవి అలా గేనన్నట్లు తలవూపి క్షణంలో ఆమె చెప్పిన కూర,అన్నం,పులుసు అన్నీతయారు చేసింది

తనే కంచంలో అన్నీ సర్దుకుని శ్రీపతి గదిలోకి తీసుకెళ్ళింది మాధవి.

ఆమె వచ్చేసరికి మంచంమీద అటు తిరిగి పడుకుని ఉన్నాడు శ్రీపతి. మాధవి శబ్దం చేయకుండా కంచం టేబుల్ పైన వుంచి "అప్పుడే నిద్రపోతున్నారా?" అంటూ అతని భుజంమీద చెయ్యి వేసింది. శ్రీపతి నిద్రపోలేదు. చటుక్కున ఆ చేయి అందుకుని "మధూ! నీకింకా నాపైన మమకారం వుందా ?" అనడిగాడు చటుక్కున ఆమెకేసి తిరిగి. వూహించని అతని ప్రశ్నకి సిగ్గులమొగ్గ అయిన మాధవి "అసలు వుందన్న విషయం ఈనాటికైనా గ్రహించారు. అందుకే ఆనందంగాని భోజనం చేయండి."

శ్రీపతిని లేవదీసి అన్నీ అతనిముందుకు జరిపింది. శ్రీపతి భోజనం అయ్యాక ఇంటికి వెళ్ళిపోయింది మాధవి. ఒక విధంగా ఆమెకి సంతోషం ఉవ్వెత్తున ఎగసే అలలులా వచ్చేస్తోంది. శ్రీపతి చూచాయగానైనా తన మనసు గ్రహించాడు. మళ్ళీ అంతలోనే ఆ ఉత్సాహమూ జారిపోయింది.

"ఇప్పుడు గ్రహించి మాత్రం ప్రయోజనం ఏమిటి ?" చూసినా చూడకపోయినా హిమబిందు అతని భార్య ఆమెని వదిలి తననేం పెళ్ళాడబోడుగదా శ్రీపతి! మంచంమీది మేనువాల్చిన మాధవిలోని ఆలోచనలు ఆశ, నిరాశలమధ్య వూగులాడుతూంటే అదే సమయంలో గదిలో మంచంమీద పడుకున్న హిమబిందు ఆలోచనలు మరో విధంగా సాగిపోతున్నాయి.

ఈ శ్రీపతిదో పెద్ద గుదిబండ అయిపోయింది అతని అందానికి హోదాకి ఉద్యోగానికి అన్నింటికీ మురిసి ముగ్ధురాలై అతన్ని పెళ్ళాడిన మాట వాస్తవమే కాని యిప్పుడు అతని కుంటితనం చూస్తుంటేనే జుగుప్సగా వుంటోంది. అతని వాలకం చూస్తుంటే పరమ రోతగా వుంది. ఇలాంటివాడింట్లో వుండగా ఎలా భరించి తిరగడం ? బొంబాయిలో సురేంద్రనాథ్ రికమెండ్ చేస్తున్న ఉద్యోగం వచ్చేస్తే బాగుండు. తనకో పెద్దలంపటం వదిలిపోతుంది. ఆ తర్వాత ఈ శ్రీపతి ఏమవుతే ఏం కావాలి ? దర్జాలు, డాబులు లేని అర్ధనరీ ఉమన్ కింద ఈ అద్దె కొంపల్లో ఎలా పడి వుండాలి బాబూ! ఓ మేడా, ఓ కారు, నౌకర్లు అబ్బ! అలాంటి జీవితం కావాలనుకున్న తనకి ఛీ! ఈ కాళ్ళు లేని వాడితో కలిసి బ్రతకాల్సి రావడమా! ఛీ! అంటూ పొర్లసాగింది.

అదే సమయంలో శ్రీపతి ఆలోచిస్తున్నాడు. హిమబిందు ప్రవర్తనతో తనకు పూర్తిగా కనువిప్పు కలిగింది. పాపం మాధవి! తనని ఏనాటినుంచో ప్రేమిస్తున్నా తను అర్థం చేసుకోలేక జగదేక రంభ అని మురిసి మూర్ఛబోయి హిమబిందు స్వభావాన్ని, మనస్తత్వాన్ని సరిగ్గా పరిశీలించకుండానే ఓ విధమైన మత్తులోపడి పెళ్ళి చేసుకోవడం అంత తెలివి తక్కువ పని మరోటి లేదు. ఇపుడా మత్తు దిగింది. అసలు రంగు బయట పడింది. మనిషికి సౌందర్యం ఒకటే సరిపోదు. మనిషికి అమృతాన్ని పంచిపెట్టగల మంచి మనసు కూడా వుండాలి. అది లేనప్పుడు మిగిలినవి ఎన్ని వున్నా ఒకటే. తనంతటి శక్తిమంతమైనది లేదన్నట్టు ఉవ్వెత్తున ఎగసిపడే సముద్రపు అల తృటిలో విరిగిపోతూనే వుంటుంది. ఇంతకీ తను విచారించి, గతాన్ని తవ్వుకుని ఏమీ ప్రయోజనం లేదు. తనకి విధంగా కళ్ళు తెరిపించడం కోసమే భగవంతుడే కాళ్ళు పోగొట్టాడు. ఇప్పుడింక పరిస్థితులు ఎలా నెట్టుకు వస్తాయో వేచి చూడటం తప్ప తనవల్ల ఏమీ అయ్యే పని కాదు." అనుకుంటూ వేదాంతాన్ని జ్ఞప్తి చేసుకుంటూ నిద్ర రావడాన్కి ఫాన్ బాగా స్పీడులో పెట్టుకుని పడుకున్నాడు శ్రీపతి.

హిమబిందు కార్యసాధకురాలు. మేనేజింగ్ డైరెక్టర్ సురేంద్రనాథ్ని ఆశ్రయించి బొంబాయిలో ఒక పెద్ద మిల్స్లో పి.ఏ. గా ఉద్యోగం సంపాదించుకుంది. ఆర్డరు ఫారం చేత బట్టుకొని తిన్నగా శ్రీపతి రూంలోకి వచ్చింది హిమబిందు.

"చూడు శ్రీపతీ! నాకు బొంబాయిలో ఉద్యోగం వచ్చింది. వెళ్ళిపోతున్నాను. నాకా బొంబాయిలో నా ఉద్యోగం నా సంపాదన నాకేసరిపోతుంది. నువ్వు నాతో రావాలనుకోవడం గాని, నేను నిన్ను తీసుకు వెడతానని గాని అనుకుంటే దానికి నేనేం జవాబు చెప్పలేను. నాకు చిన్నప్పట్నించీ అందం పట్ల ఎంత శ్రద్ధో, ఎంత ఆరాధనో నీకు తెలుసు. నా అభిప్రాయాలూ నీకూ తెలుసు, నాకు కావాల్సింది అన్ని హంగులూ వున్న కంఫర్టబుల్ లైఫ్. ఇల్లు, మనుష్యులు అధునాతనంగా వుండే పద్ధతిలోనే నాకు మనస్సుకు తృప్తి. నా ఆశలకి, కోరికలకు ఏ మాత్రం విరుద్ధంగా వున్నా నేను భరించలేను. అందుకే వెళ్ళిపోతున్నాను. మనం శాంతి యుతంగానే విడిపోదాం." అంటూ కాగితాలు తెల్లని రెండు తెచ్చింది.

ఏదో ఒకనాడు ఈ మాట ఆమె నోటి వెంబడి రాక మానదనుకున్న శ్రీపతి ఏ మాత్రం ఆశ్చర్యపడలేదు.

"మంచిది హిమా! నీ నిర్ణయం చాలా సముచితంగా వుంది నా వల్ల నీకు ఏ విధంగామూ సుఖంలేదు, నీ దృష్ట్యా ఆలోచిస్తే మనం విడిపోవడం చాలా మంచిది." అంటూ ఇద్దరూ చెరి ఒక కాగితం విడిపోతున్నట్లు రాసుకున్నారు. అతని మంగళసూత్రం అతనికిచ్చేసింది. తన సామాన్లన్నీ ప్యాక్ చేసుకుంది. రైల్వే స్టేషన్లో సామాన్లు బోగీలో వేయించుకుంది. చిన్న చిరునవ్వుతో అవూరికి, శ్రీపతికి గుడ్బై చెప్పేసి స్టేషన్కు వెళ్ళి బొంబాయికి హైద్రాబాద్ మీదుగా వెళ్ళాలని రైలెక్కింది.

(ఇంకా వుంది)

### ప్రేమాకృతి

దూకుతున్న జలపాతం
ఆలోచిస్తుందా ?
పొర్లుతున్న నీలిమబ్బు
అవలోకిస్తుందా ?
పడిలేచే కడలితరగ
అనుభూతికి వశమౌనా ?
చిగురించే మావికొమ్మ
వలపులరుచి ఎరుగునా ?
కల్పన ఇగురొత్తు మదికి
గమ్మత్తుకదా ప్రకృతి !
రసస్పందనలు చిందే
కవికంతా ప్రేమాకృతి !!

— కేఎస్వీ

# వారఫలం

——మహేష్——

## 13–1–1978 శుక్రవారం మొదలు 19–1–1978 గురువారం వరకు

**మేషం :—** మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. సాటివారిలో గౌరవం బాగుంటుంది. స్త్రీలకు:— ఆరోగ్యం బాగుండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృషభం :—** ప్రయాణాలు ఫలిస్తాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం మధ్యలో మీతాలూకు వస్తువులు పోవచ్చును చికాకులకు గురి కాగలరు. వ్యతిరేకమైన వార్తలను వింటారు. స్త్రీలకు కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. సాహిత్య కళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**మిధునం :—** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి రావలసిన డబ్బు అందగలదు. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీకృషిరాణిస్తుంది. స్త్రీలకు: ఆరోగ్యం బాగుంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**కర్కాటకం :—** నూతనవ్యవహారాల లాభిస్తాయి. రావలసిన డబ్బు అందుతుంది అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. దైవకార్యాల నెరవేరతాయి. స్త్రీలకు : బంధుమిత్రులను కల్సుకొంటారు. సంతోషకరమైన వార్తలనువింటారు.

**సింహం :—** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. రావలసిన డబ్బు అందుతుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. స్త్రీలకు కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. విలాస వస్తువులు కొంటారు.

**కన్య :—** భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాలు బాగుంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. వారం మధ్యలో మీతాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. ఆందోళన కలుగుతుంది. స్త్రీలకు ఆరోగ్యం బాగుండదు. సాటివారిలో గౌరవం లభించగలదు.

**తుల :—** మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. రావలసిన డబ్బు అందుతుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. స్త్రీలకు కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

**వృశ్చికం :—** వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. సాటివారితో వాద ప్రతివాదాల తగవు. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు. స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. బంధువుల వ్యవహారాల్లో శ్రమపడినా, మాట దక్కదు.

**ధనుస్సు:—** మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగించగలదు. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. మిత్రుల సహాయం లభిస్తుంది. స్త్రీలకు ఆరోగ్యం బాగుంటుంది పుణ్యకార్యాల చేస్తారు.

**మకరం:—** వృత్తిలో సాటివారి పోటీ తగ్గుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. ప్రయాణాలు వాయిదా పడతాయి. స్త్రీలకు సంతోషకరమైన వార్తలను వింటారు. బంధు మిత్రులను కల్సుకొంటారు.

**కుంభం:—** మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. నూతన వ్యవహారాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. స్త్రీలకు ఆరోగ్యం బాగుంటుంది. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు.

**మీనం:—** ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. రావలసిన డబ్బు అందుతుంది. ప్రయోజనం గల వ్యక్తులను కల్సుకొంటారు. మీ ఆలోచనలు ఫలించగలవు. స్త్రీలకు కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. విలాస వస్తువులు కొంటారు.

# మెనిమెంటు







ద్విభాష్యం
రాజేశ్వరరావు

**ఒ**కనాటి మధ్యాహ్న సమయంలో—

'బాబా ఇన్‌స్ట్రుమెంటు కంపెనీ' కార్మికులు సమ్మెలోకి దిగేరు !

ఈ వార్త విన్న మంత్రివర్యులు కార్మికుల్ని రక్షించటంకోసం ఆ వూరి విమానాశ్రయంలో దిగేఁ !!

కంపెనీ ఆస్తిపాస్తుల్ని కార్మికులు ధ్వంసం చేయకుండా పరిరక్షించటాన్కి — పోలీసువారు వేనుల్లో దిగేరు !!!

ఇంతమంది ఇన్ని విధాల దిగినా, కంపెనీ పాలకవర్గంవారు' మాత్రం ఒక్క 'మెట్ను కూడా దిగలేదు !!!!

దిగవలసిన అవసరం తమకు లేదని బల్ల మీద రూళ్ళకర్రతో కొట్టి మరీ చెప్పారు. ఢంకామీద కొట్టి చెప్దామనుకున్నారు కాని ఆ కంపెనీలో కొన్ని సున్నితమయిన పరికరాలే తప్ప ఢంకాలు తయారు చేయరు కనుక వారికా అవకాశం చిక్కలేదు. అసలు, ఆ మధ్యాహ్న సమయంలో కార్మికులు సమ్మెకు దిగిన కారణం ఇది —

'లంచ్' సమయంలో ఆ కంపెనీచేత నడపబడుతున్న కేంటీనులో 'చటోపాధ్యాయ' తన అనుచరులతో కలిసి కూర్చుని కబుర్లుచెప్తూ, భోజనానికి ఉపక్రమించేడు. చటోపాధ్యాయ ఆ కంపెనీ కార్మికవర్గానికి నాయకుడు. మనిషి సన్నగా పీలగావున్నా అతని బుర్ర అమోఘమయినదని ఆ కంపెనీలో చాలామంది అభిప్రాయం. ఈ అభిప్రాయంతో ఏకీభవించటానికి చటోపాధ్యాయకు అణావంతయినా అభ్యంతరం లేదుకూడా !

"మేనేజిమెంటు ఈ మధ్య మరీ మితి మీరి పోతోంది గురూ!" అన్నాడొక శిష్య పరమాణువు

గురువు అవునన్నట్టు తల ఆడించి ఊరుకున్నాడు.

'ఏంవిటి? ఏంవైంది?' అని అడగలేదు తను. అలా అడిగితే అతని గొప్పతనంవేలేదు.

"...మన ముత్తెంగాడు లేడూ? ఎవరు? మన 'ప్యూను' ముత్తెంగాడు— ఆడికి, సరిగ్గా పన్జెయ్యలేదని చెప్పి ఛార్జిషీటిచ్చేసినారు. మనం విలా వూరుకుంటే శానా గోరాలు జరిగిపోతాయి." అని ఆగేడు శిష్యుడు. ఆగేక, తను చెప్పిన సంగతి 'గురుడు' మీద ఏ మాత్రం పని చేసిందో చూస్తూ వుండిపోయాడు. అంతలోనే సర్వరు కుర్రాడు "సార్! క్రరీ!" అంటూ ప్లేటుతో కోడిగుడ్డు తీసుకొచ్చి అక్కడ వుంచేడు,

చటోపాధ్యాయ సర్వరు కుర్రాడి వంక సీరియస్‌గా చూసేడు. తరువాత "ఇదేటిరా?" అన్నాడు. అనలేదు, అరిచేడు!! తను ప్లేటుతో తెచ్చింది ఉడికించిన కోడిగుడ్డే తప్ప పేలబోయే ఆటంబాంబు కాదని చెప్పినంత సున్నితంగా "గుడ్డు..కోడిగుడ్డు" అన్నాడు.

"అది కనబడుతూనే వుంది! గుడ్డు కోడి కాకపోతే నువ్వెడతావేటి? అసలు 'మెనూ' ప్రకారం ఈయేళ కాంటీనులో ఏం వండాలి?" అన్నాడు.

"చేపల కూర" అన్నాడు వాడు నసుగుతూ.

"మరి వండలేదేఁ? గుడ్డెందుకు పట్టుకొచ్చావ్? మాకు చేపలకూరే కావాలి?" చటోపాధ్యాయకు చేపలన్నా, స్ట్రైకులు చేయించటమన్నా చాలా ఇష్టం, అతడు పుట్టటం వంగదేశంలోనయినా, పెరగటం ఆంధ్రదేశంలోనే జరిగింది. '. ఆవేశానికి మటుకు అతని నరనరాల్లో వంగరక్తం నిండుగా వుంది.

"నాకేం తెలీదు సార్! కేంటీను మేనేజరుగారిని అడగండి!" అంటూ సర్వరు కుర్రాడు మెల్లిగా జారుకున్నాడు.

చటోపాధ్యాయ తింటున్న ప్లేటు ఎదరకు తోసేసి లేచి నిలబడి చుట్టూ కలయ జూశాడు. తరువాత చరచరా 'కౌంటరు' దగ్గరికి వెళ్లేడు. "మేనేజర్! ఈ వేళ 'మెనూ' ప్రకారం చేపల కూరేనా?" అన్నాడు.




## యెలిమెంటు

"అవునండి. కానీ, చేపలు బజారులో దొరకటంలేదు అందుకని, గుడ్లు వండించేను." అన్నాడు మేనేజరు

"సరే! మాకు ఇప్పుడు చేపలకూర కావాలి. ఇంతకీ వండిస్తారా? లేదా?"

"అలాగే? చేపలు ఎక్కడా దొరకటం లేదని చెప్పానుగా నాలుగయిదు రోజులుగా అసలు చేపలు మార్కెట్టులోకే రావటం లేదు. దొరకని కూర వండించమంటే ఎలా చెప్పండి?" అన్నాడు మేనేజరు వినయంగా

"సరే! ఎలా వండించరో చూస్తాం" అంటూ చటోపాధ్యాయ హాలు మధ్యలోకి వచ్చి "ఫ్రెండ్స్..." అంటూ గొంతు సవరించుకున్నాడు. అప్పటికే ఈ సంగతి చూచాయగా తెల్సిన చాలామంది భోజనం మాని అతని చుట్టూ గుమిగూడేరు. "ఈవేళ చాలా దుర్దినం..." అంటూ క్షణంసేపు 'రెస్పాన్సు'కోసం చుట్టూ కలయజూశాడు చటోపాధ్యాయ. తరువాత మళ్ళీ తన ప్రసంగం కొనసాగించేడు ... "కేంటీన్‌లో మనకి దినం చేపల కూర వడ్డించాలి. కాని, చేపలు దొరకటంలేదని గుడ్డు వండేరు. అంటే, మేనేజిమెంటువారు మనం 'వూరుకున్నామని, వారి చిత్తప్రకారం ప్రవర్తిస్తున్నారన్నమాట! వారు ప్రతి విషయంలోనూ మనపై ఎలా పెత్తనం చెలాయిస్తున్నారో తెలుసుకోవాలంటే ఈ చిన్న విషయం చాలు. ఈ రకమయిన అన్యాయాలు ఇక మనం కొనసాగనివ్వకూడదు. ఈ దినం చేపలకూర వండనిదానికి నిరసనగా మనం 'వాకౌట్' చేద్దాం" అన్నాడు ఆవేశంగా.

చుట్టూవున్న జనంలో కలకలం ప్రారంభమయింది.

"యూనియన్..." అంటూ రెండు చేతులూ ఎత్తి గట్టిగా అరిచేడు చటోపాధ్యాయ

"జిందాబాద్!" అన్నాయి కొన్ని గొంతులు!

కాని చటోపాధ్యాయకు సంతృప్తిగా అన్పించలేదు మరోమారు "యూనియన్" అంటూ పిడికిళ్ళు బిగించేడు. ఈమారు గొంతులన్నీ కలిసి "జిందాబాద్" అన్నాయి.

తల దించుకుని కేంటీనునుండి నడిచి కంపెనీ గేటు బయటకు వెళ్ళిపోయాడు చటోపాధ్యాయ చుట్టూవున్న మూడు వందలమంది కార్మికులూ అతన్ని అనుసరించేరు.

గేటు బయటకు రాగానే మళ్ళీ పెద్ద ఎత్తున నినాదాలు చేసేరు.

నినాదాలు చేసిన వారిలో సగం మందికి పైగా 'వాకౌట్' ఎందుకో అప్పటికీ అర్థం కాలేదు. "మనం 'ఈ వాకౌట్' ఎందుకు చేసేం?" అని అడిగేడు ఒకడు తన ప్రక్కనున్న వాణ్ణి. "ఏమో! తెలీదు! సంగారెందుకు? బయటకు వచ్చేసేం కదా,

(36 వ పేజీ చూడండి)

*(గత సంచిక తరువాయి)*

# రాగమాలిక

శ్రీమతి
మాదవపెద్ది పుణ్యశీలాప్రసాద్

ఎన్నాళ్లకో నా ఇల్లు మళ్లీ నవ్వులతో కళకళ లాడింది! వాళ్ల స్నానాలయినాక టిఫిన్లు కానిచ్చాము.

"చాలా చేయించావ్ మంజూ!" అన్నాడు అన్నయ్య.

"మైసూరుపాకం అమ్మగారే చేశారు." భాగ్యమ్మగారు అంది.

"అందుకేకాబోలు ఇంత తియ్యగావుంది." వదిన నవ్వింది.

"మరేమిటనుకున్నావు? మూడురకాలయిన ప్రేమాభిమానాలు రంగరించి చేశాను తెలుసా?"

అన్నాను నేను నవ్వు నావుకుంటూ.

"అదేమిటి?"

"అవును! అత్త—ఆడబిడ్డ—స్నేహితురాలు. ఈ మూడురకాల అభిమానాలు వున్నాయి దాంట్లో!"

అందరూ నవ్వారు నా మాటకి.

"మంజూ! అందర్నీ ఇంత ప్రేమగా తినిపిస్తావే – మరి నువ్వెందుకే అసలే తినవు?" అన్నయ్య అడిగాడు.

"నేనెందుకు తినను అన్నయ్యా?"

"ఆవిడ యెందుకు తినదండీ ... లావయి పోతానని భయం!" వదిన.

ఇంతలో చంటివాడు 'కీర్' మన్నాడు బెడ్ రూమ్‌లోకి పరుగెత్తాను నేను.

బోర్లాపడి – ముక్కు మంచంకోడుకి కొట్టుకొని ఏడుస్తున్నాడు నాడు

"లేదు ... లేదు ... మానాన్నగా!"

సముదాయిస్తూ యెత్తుకొచ్చాను ఇవతలికి.

కాఫీలయ్యాకా అందరం హాల్లో కూచున్నాం.

"మంజూ! కారమ్స్ ఆడదామా? పేకా?" అన్నయ్య అడిగాడు.

"నీ ఇష్టం." అన్నాను నేను.

"కారమ్సే." వదిన అంది.

ముగ్గురం యెంతోసేపు ఆడాం.

బాబు నా చేతిలోనే వున్నాడు.

వళ్లుచేసి ముద్దుగా తెల్లగా వున్నాడు.

చేతులు నోట్లో కుక్కుకుంటూ – బోసినవ్వులు కురిపిస్తూ – చూస్తే వదలబుద్ధి కాదు యెవరికయినా!

"అన్నయ్యా! వీడిలో మన మధు పోలికలు వున్నాయికదూ?" అన్నాను వాణ్ని ముద్దు పెట్టుకుంటూ.

"అవునే – మధు నీ పోలికేగా! అంటే వీడికి మేనత్త పోలికే వచ్చిందన్నమాట!" అన్నా డన్నయ్య నావైపే తదేకంగా చూస్తూ.

"బాబోయ్ – మేనత్త పోలికే!? వద్దు – వద్దు"

వదిన నవ్వుతూనే అంది అది హాస్యమే!

కానీ – నా మనసు చివుక్కుమంది!

నా నెత్తిన చిన్న మొట్టికాయవేస్తూ – "ఏమండోయ్! ఈ పెంకిపిల్ల పోలిక వస్తే ఇంకేమన్నా వుందా? మనం వేగగలమా వీడితో? ఏమ్మా మంజూ! పెద్దదైతే అయింది సుధకే చేసుకోవాలి వీణ్ని! నువ్వే భరించాల్సిందే వీడి మొండితనమంతా!"

గలగలా నవ్వింది వదిన.

నేనూ నవ్వాను. కానీ, పెదవుల చివరినించి వచ్చిన నవ్వది!

పరిశీలనగా నా ముఖంవంక చూసిన వదిన కేమనిపించిందో మరి – ఠక్కున నవ్వడం ఆపేసింది.

"మంజూ!" నెమ్మదిగా – అతిమృదువుగా పిలిచింది. నేను తల వంచుకున్నాను.

"నిన్ను బాధపెట్టానా? ఏదీ ఇటు చూడు! ఏదో సరదాగా అన్నాను. నన్ను క్షమించవూ? నీ పోలికకేం? నిజంగా నీలాగవుంటే మాకు అదృష్టంగూడా! నీ గుణం బంగారంకదూ? ప్రేమరాశివి నువ్వు!" చిన్నపిల్లని బుజ్జగించినట్లు నన్ను బుజ్జగిస్తోంది వదిన.

నా కళ్లు నిండాయి వదిన భుజంమీద వాలిపోయాను.

"ఛీ ఛీ! మరీ ఇల్లా, తయారయ్యానేమిటి నేను? నలుగురితో కలిసి నవ్వలేకపోతున్నానా? నా మనసు ఇంత సంకుచితమై పోయిందా? హాస్యాన్ని హాస్యంగా తీసుకోలేనా?"

నామీద నాకే అసహ్యం వేసింది.

సాయంత్రం అన్నయ్య సినిమా ప్రోగ్రాం పెట్టాడు.

వదిన ముందు రానంది.

"వీణ్ని తీసుకుని నేను రాలేను. మంజూ! మీరిద్దరూ వెళ్లండి."

"ఊహూఁ! నువ్వు రాందే నేనూ వెళ్లను" అన్నాను నేను.

"ఎట్లాగమ్మా మంజూ! వీడు మరీ పసివాడాయె." అచ్చమైన తల్లిలాగే అన్నది.

"ఫరవాలేదులే. వాడు ఇప్పట్నించే సినిమాలు చూడడం నేర్చుకుంటాడు. అంతగా ఏడిస్తే నేను ఎత్తుకుతిప్పుతాను. సరేనా? నువ్వూ ఈ మూడునెలలుగా సినిమాలే చూడలేదుకదూ? రావాల్సిందే!"

ఎట్లాగైతేనేం వదినని కూడా బయల్దేర తీశాను.

అనుకుని ఇద్దరికీ వున్నవాటిల్లో ఒకే రంగు చీరల్ని ఎన్నికచేశాం.

బాబుని చక్కగా నేనే రెడీ చేశాను.

వాడు సాక్స్, స్వెట్టరు టోపీలతో ఎంతో అందంగా వున్నాడు.

అన్నయ్య వదినలు పక్కపక్కగా కూచున్నారు.

బాబుని నేను ఒళ్లో పెట్టుకుని కూచున్నాను.

సినిమా బాగానే సాగుతోంది.

ఉన్నట్టుండి ఏడుపు మొదలుపెట్టాడు బాబు. సముదాయించబోయాను. వాడు వూరుకుంటేగా? వదిన వాణ్ని తీసుకుని ఒళ్లో వేసుకుని పమిట కప్పింది. ఆ తరువాత కిమ్మనలేదు వాడు

ఇంతలో లైట్లు వెలిగాయి.

ఇంటర్వెల్

అన్నయ్య లేచి "ఏమన్నా తీసుకుంటారా మంజూ?" అన్నాడు. నేను వద్దంటే వదిన కూడా వద్దనవచ్చు.

"కాఫీ!" అన్నాను నేను.

అన్నయ్య మూడు కాఫీ, వేయించిన జీడిపప్పు తెప్పించి యిచ్చాడు.

"హల్లో మంజూ!"

గిరుక్కున వెనక్కితిరిగాను.

రామం!

"ఏం మంజూ! కనబడ్డమేలేదే ఈమధ్య? అమ్మ రోజూ అడుగుతోంది నీగురించి! ఈయన మీ అన్నయ్యకదూ? అవునా?" అన్నాడు అన్నయ్యనే పరిశీలనగా చూస్తూ.

"అవును. అన్నయ్యే! అన్నయ్యా, బెజవాడలో మనింటి పక్కన శేషగిరిరావుగారి ముద్దులకొడుకు రామం గుర్తులేదూ? మనం కలిసి ఆడుకునే వాళ్లం."

అన్నయ్యకి రామాన్ని పరిచయంచేశాను.

"ఏరా రాజూ! జ్ఞాపకంవచ్చిందా ఇప్పటికైనా? మనం ఆడుకున్న ఆటలూ, పోట్లాటలూ – అన్నీ మర్చిపోయావా?" రామం నవ్వాడు.

"రామం అన్నయ్యా..."

"నేనింకా ఏమిటో చెప్పబోయాను.

"గుర్తొచ్చిందిలేవే – వీడిక్కడికి ఎట్లా వచ్చాడా అని ఆలోచిస్తున్నాను అంతే! ఏమిట్రా నువ్వు ఫారిన్‌లో వున్నావని విన్నానే...?" రెండు చేతులూ రామం భుజాలమీద వేస్తూ అన్నాడు అన్నయ్య.

"అవున్రా! ఈమధ్యనే తిరిగొచ్చాము." అని "వీడు మీ సుపుత్రుడా?" అమాంతం వాణ్ని ఎత్తుకుంటూ అడిగాడు

"అవును ఈవిడ నా శ్రీమతి సుశీల"

వదిన నమస్కారం చేసింది

రామం తలెత్తి చుట్టూ వెతుకుతున్నాడు ఎవరికోసమో.

"మీ ఆవిడకోసమా ?" నవ్వుతూ అన్నాను నేను.

"కాదు. మీ ఆయనకోసం."

అన్నాడు సీరియస్‌గా రామం.

చటుక్కున్న నా మొహం నల్లబడింది.

"ఎంతమందిరా రామం నీకు పిల్లలు ?" అన్నయ్య నా ముఖాన్నికనిపెట్టి మాటమార్చేశాడు

"నాకా ఏదీ ఇప్పుడే ..." అని ఆగి పెద్దగా నవ్వాడు.

అన్నయ్యా, వదినా గూడా నవ్వారు

"మరి మీ ఆవిణ్ణి తీసుకురాలేదా ?" వదిన

"ఆవిడ రాలేనంది." క్లుప్తంగా అన్నాడు

నేను ఆ తరవాత సినిమా సరిగ్గా చూడలేక పోయాను. ఇన్నాళ్ళూ నా కథ దాస్తూవచ్చాను రామం దగ్గిర. ఇక తెలిసిపోక తప్పదనిపిస్తోంది తెలిస్తే వాళ్ల సానుభూతి అసలు భరించలేను నేను

సినిమా అయిపోయింది

రామం మా అందర్నీ ఆ తరువాత ఆదివారం వాళ్ళింటికి డిన్నరుకి ఆహ్వానించాడు.

"తప్పకుండా రావాలి. మళ్లీ వచ్చికూడా పిలుస్తాలే"

"వద్దు రామం ! ఇంక పిలవనక్కరలేదు. మేం వస్తాంగా ?" అన్నయ్య అన్నాడు

"ఆల్‌రైట్ !" అన్నాడు రామం

ఇంటికి తిరిగివచ్చాం.

వచ్చే దారిలోనే వర్షం పట్టుకుంది

నా మనసులాగే వాతావరణంకూడా చికాకుగా వుంది

ఉరుములు, మెఱుపులు !

నాకు తల పగిలిపోతోంది. ఏమాత్రం అన్నం తినాలనిలేదు నేను తినకపోతే వాళ్ళూ తినరని అన్నానికి కూర్చున్నాను

నా స్థితి గమనించిన అన్నయ్యా, వదిన నన్నేమీ పలకరించకుండా మౌనంగానే వున్నారు

కాసేపు బాబుతో ఆడుకున్నాను

పదకొండు గంటలకి పడక చేరిన నేను ఆరోజు జరిగినదంతా నెమరువేసుకున్నాను

తప్పు నాదేనేమో ! అందరిలా నేనెందుకు వుండలేకపోతున్నాను ? ప్రతిదానికీ ఇట్లా భుజాలు తడుముకుంటున్నాను ఎందుకు ? ఎవ్వరూ నాకు ఏవిధంగానూ లోపం చెయ్యడంలేదు వేలెత్తి చూపించడంలేదు మరి ఎందుకు నాకీ క్షోభ ? ఎందుకు నాకీ మథన ? నన్ను నేనే తక్కువ అంచనా వేసుకుంటున్నానేమో ? 'మొగుడు వదిలేసిన ఆడది' అనే భూతద్దంలోంచి అందరూ నన్ను చూస్తున్నారనే భ్రాంతి నాలో పాతుకు పోయింది దాన్ని నేను పోగొట్టుకోవాలి అప్పుడే నేను మామూలుగా వుండగలను అంతదాకా నాకు మనశ్శాంతి రాదు. కానీ, దాన్ని పోగొట్టుకోవడం ఎట్లా ?

ఆలోచనలతో అసలు నిద్రే పట్టలేదు

# రాగమాలిక

లేచి లైటు వేశాను.

బల్లమీద వున్న పుస్తకాల్లోంచి అందిన పుస్తకం తీశాను

- అది భగవద్గీత !

## 7

ఆదివారం రానేవచ్చింది

పొద్దుటే సూర్యుడు తన తీక్షణతను చూపిస్తున్నాడు నేను రామం ఇంటికి డిన్నరుకి పోదల్చుకోలేదు. కావాలనే బద్ధకంగా మంచంమీద పడుకున్నాను పొద్దుటినించీ కూడా !

వదినే అన్ని పనులూ చూసుకుంటుండా రోజు నాకు బాధ అనిపించినా, అట్లాగే పడుకున్నాను రోజూ బాబుతో ఆడుకునేదాన్ని. ఆరోజు వాడితో గూడా ఆడుకోబుద్ధికాలేదు.

అన్నానికి కూడా లేచి వెళ్లలేదు.

అన్నం వద్దని తప్పించుకోబోయాను.

వదిన వినలేదు అన్నం మంచం దగ్గిరికే తెచ్చింది నా మనసు ఆర్ద్రమైంది. వదిన

**జరిగిన కథ - 2** నిద్రమాత్రలు వేసుకుంటేగానీ నిద్రపట్టని జీవితం మంజులది. సంవత్సరమంతా అంధకారంలో గడిపే మంజుల జీవితంలోకి వెలుగుని తెస్తారు శలవులకి ఇంటికొచ్చే సుధ, మధులు కానీ అందులోనూ అసంతృప్తే. కొడుకు వస్తే కూతురో, కూతురు వస్తే కొడుకో ఎవరో ఒకరు తండ్రి దగ్గర కెళ్ళిపోతారు ఇద్దరూ ఎప్పుడూ కలిసిరారు. చిన్ననాటి స్నేహితుడు రామం కలసి గుర్తుపడ్తాడు మంజులని. రామం భార్య రాధ బారసాల చేసుకున్న తర్వాత భార్య సుశీలని తీసుకుని చెల్లెలు మంజుల దగ్గరికి వస్తాడు రాజు.

పూర్వజన్మలో నా కన్నతల్లేమో ! లేకపోతే నామీద ఎందుకంత శ్రద్ధ తనకి ?

"తింటావా లేచి ? నోట్లో పెట్టాలా ?" చిలిపిగా అడిగింది

"వదినా ! నువ్వు నాదగ్గిరే వుండిపో కూడదూ ?" గబుక్కున అనేశాను

"ఆఁ అట్లాగే వుంటాను మీ అన్నయ్యని ఏ హరిద్వారమో -- హృషీకేశమో వెళ్లి తపస్సు చేసుకోమని చెప్పి. ." గలగలా నవ్వింది వదిన.

అంతలోనే నవ్వు నాపేసి — నా తల నిమురుతూ — "అసలు నిన్నే నా దగ్గిర వుంచుకుందామనుంది. నువ్వేమో ఈ కాలేజీ ఒకటి పెట్టుకున్నావు. నువ్వసలు ఒంటరిగా వుండడం మాకిష్టంలేదు కనీసం కొన్ని రోజులయినా నిన్ను తీసుకెళ్లి నాలో వుంచుకుందా మనుకుంటున్నాను. ఇక్కడ మరీ ఆలోచనలతో మనసు పాడుచేసుకుంటున్నావు. తిండీ, నిద్రా లేకుండా చిక్కిశల్యమవుతున్నావు." వదిన కళ్ళల్లో నీళ్లునిండాయి గొంతు గాద్గదికమైంది.

"వదినా ! నేనంటే నీకెంత ఆపేక్ష."

ఇంకా ఏదో అనబోతుంటే మామిడికాయ పప్పు బాగా నెయ్యివేసి కలిపిన ముద్ద నోట్లో పెట్టేసింది — కన్నీళ్లతోనే నవ్వుతూ.

అన్నం అంతా తినేదాకా అట్లాగే కబుర్లు చెప్తూ కూచుంది

తిన్నాక కంచం తీసుకుని వెళ్తూ— "ఇప్పుడు ఇంక హాయిగా నిద్రపో. నిన్నెవర్లూ డిస్టర్బు చెయ్యరు. సాయంత్రం డిన్నరుపార్టీ వుందిగా ?" అంది

"ఎట్లాతప్పించుకోడం?"అని ఆలోచిస్తూనే నిద్రపోయాను. రాత్రంతా నిద్ర లేనందువల్లనేమో బాగా నిద్రపట్టేసింది.

నాలుగు గంటలకి లేచి మొహం కడుక్కుని వచ్చాను

"ఎట్లావుంది మంజూ వంట్లో ?" వదిన అడిగింది కాఫీ తెచ్చిస్తూ !

"ఇంకా అట్లాగేవుంది వదినా ! కాస్త జ్వరం వచ్చినట్లు గూడా వుంది. ఒక పని చెయ్యండి నేను మాత్ర వేసుకుని పడుకుంటాను రాత్రికి నాకేమీ వద్దు మీరు రామం వాళ్లింటికి వెళ్లిరండి నాకిట్లా వుందని చెప్పండి. ఏమనుకో వద్దని నువ్వు స్వయంగా చెప్పు. సరేనా ?"

కాఫీకప్పు చేతిలోకి తీసుకుని అన్నాను.

"సరేలే — నీకిట్లా వుంటే నిన్నొదిలి మేము మాత్రం వెళ్తామా ? ఇవాళకాదు మరోసారి వస్తామని ఫోనుచేసి చెప్తాను"

"వద్దు, వద్దు. నాకేం ఫరవాలేదు మాత్ర వేసుకుంటే తగ్గిపోతుంది. కాస్త రెస్ట్ కావాలని రానంటున్నాను అంతే నా కోసం మీరెందుకు మానెయ్యడం ? తరువాత టైము వుంటుందో వుండదో మీరు వెళ్లిరండి. లేకపోతే రామం ఏమన్నా అనుకుంటాడు. ప్లీజ్ ! మీరు మాత్రం తప్పకుండా వెళ్లాలి సరేనా ? — చెప్పు - ఊఁ ? వెళ్తారుకదూ ? ఊఁ అను — అను వదినా !" బతిమాలాను

వాళ్ళుకూడా వెళ్లకపోతే రామం మళ్లీ ఇంకోరోజు ఈ ప్రోగ్రాం పెడతాడు అప్పుడు నేను వెళ్లక తప్పదు అప్పుడు నాకు వంక దొరకదు ! వెతుక్కోవాలి

'సరే—' చివరికి అంగీకరించింది వదిన

"ఏమిటే మంజూ — నువ్వు రావా ?" ఏదో పనిమీద బయటికి వెళ్లిన అన్నయ్య సాయంత్రం వస్తూనే అడిగాడు

"ఇవాళ్టికి నన్ను వదిలెయ్యి అన్నయ్యా ప్లీజ్ !"

అన్నయ్య కూడా వప్పుకున్నాడు చివరికి

సాయంత్రం ఆరు గంటలకు అన్నయ్య. వదిన బాబుని తీసుకుని నన్ను రెస్ట్ తీసుకోమని హెచ్చరించి — అన్నం మానెయ్యద్దని — తింటానని ఒట్టు వేయించుకుని మరీ వెళ్లారు.

నేను తేలిగ్గా నిట్టూర్పు విడిచాను.

ఎనిమిదయింది నేను లేవలేదు. లేవబుద్ధి కాలేదు భాగ్యమ్మగారు అయిదారుసార్లు వచ్చి బతిమాలింది — భోజనానికి లేవమని !

"నాకు ఆకల్లేదు తరవాత తింటాను మీరు తినెయ్యండి" అన్నాను ఆఖరికి

ఆవిడ ఏమనుకుందో ఏమో – మళ్ళీ నన్ను పిలవలేదు. కళ్ళు మూసుకున్నాను. కాలం గడిచింది.

"మంజూ! –"

ఉ క్కిపడి లేచాను.

రామం నిలబడివున్నాడు నా ఎదురుగా!

భయకంపిత నయ్యాను

ఏది వద్దనుకున్నానో అదే ఎదురయింది

"ఎట్లా వుంది వంట్లో?" ఆప్యాయంగా అడిగాడు.

నేను గబగబా సర్దుకుని లేచి కూచున్నాను

'కొంచెం నయమే –'

"అయితే పది నిమిషాలు వెయిట్ చేస్తాను. నువ్వు రెడీ అయ్యి రా – వెళదాం నువ్వేం తినద్దు మాకు కంపెనీ యివ్వు చాలు! రాధ, అమ్మ ఎదురు చూస్తున్నారు. తొందరగా వెళ్ళాలి మనం ఊఁ!"

తొందర చేశాడు.

"రామం – నేను భోంచేసేశాను. నువ్వెం దుకు వచ్చావు నా కోసం?"

"ఏదీ నా మొహంలోకి చూసి చెప్పు! నువ్వు భోంచేశావా? వస్తూనే నేను వంటింట్లోకే వెళ్ళాను తెలుసా? ఎక్కడి గిన్నె లక్కడే మూత పెట్టివున్నాయి టేబిల్‌మీద పెట్టిన కంచం – మంచినీళ్ళ పెట్టి ఎవి పెట్టినట్లే వున్నాయి. వంటావిడ వంటింట్లో పడుకోని వుంది నేను వెళ్ళిన చప్పుడుకి లేచింది. ఆవిడే చెప్పింది నువ్వింకా అన్నం తినలేదనీ – అసలు లేవనే లేదనీను –"

నేనేం మాట్లాడను ఇంక?

"నువ్వు యిప్పుడు పది నిమిషాల్లో వస్తావా– రావా? లేకపోతే నీకోసం నేమకూడా యిక్కడే భోంచెయ్యాల్సి వస్తుంది వాళ్ళందర్నీ అక్కడ వదిలి – అది బావుంటుందేమో నువ్వే ఆలోచించు –" బెదిరిస్తున్నట్లు అన్నాడు.

ఎందుకింత మొండిగా వున్నాడు రామం? అయిష్టంగా కదిలాను నేను కొన్ని పనులు మన కిష్టం లేకపోయినా చెయ్యాల్సే వస్తుంది

ఏదో కోపంగా–అన్యమనస్కంగా తయారయి వచ్చాను

"వెరీ గుడ్ అట్లా వుండాలి!"

లేచాడు రామం

ఇరవై నిమిషాల్లో వాళ్ళింటికి చేరాం.

రాధ వచ్చి ఆప్యాయంగా లోపలికి తీసికెళ్ళింది

"మొత్తానికి రామంగారు అనుకున్న పని చేసితీర్తారు –" వదిన అంది నవ్వుతూ!

నేనూ నవ్వాను.

భోజనాలు ముగిశాయి.

వదినకీ – నాకూ బొట్టు పెట్టి పట్టు జాకెట్టు గుడ్డలూ, బాబుకి ఖరీదైన డ్రస్సూ ఇచ్చారు రాధా, రామం. విచిత్ర మేమిటంటే వున్న గంటలో యాభైసార్లు ఊసెత్తే రామం ఆయన గురించే మాట్లాడలేదు!

నేనసలు ఆ భయంతోటే రామం ఇంటికి రాకూడదనుకున్నది. కానీ రామం యెందుకు అడిగివుండడా అని ఆలోచిస్తున్నాను.

అన్నయ్యా, వదిన ఏమైనా చెప్పివుంటారా? ఏం చెప్పివుంటారు?

తలుచుకున్న నా మొహం ఎర్రబడ్డది

* * *

రోజులు గడిచిపోతున్నాయి

అన్నయ్యా, వదిన నన్ను అపురూపంగా చూసుకుంటున్నారు.

అన్నయ్య బెజవాడ వెళ్ళి వస్తున్నాడు వారానికి రెండు మూడు రోజులు ఇదివరకటిలాగే

వదిన వచ్చి రెండు వారాలవుతోంది.

రోజూ కాలేజీకి వెళ్ళేదాకా బాబుతో ఆడుకోవడం, వదినతో కబుర్లు చెప్పడం – తిరిగి రాగానే మళ్ళీ బాబుతో ఆటలు, అందరం కలిసి ఎక్కడికన్నా వెళ్ళడం.

మధ్య మధ్యలో సుధ, మధుల ఉత్తరాలు – రామం, రాధల రాకపోకలు

సంతోషంగా గడిచిపోతోంది కాలం

ఒకరోజు కాలేజీనించి రాగానే వదిన –

"మంజూ! రేపే మన ప్రయాణం." అంది

"రేపా? రేపేనా? ఇంకా కొన్నిరోజులు వుండకూడదా? నేనేమన్నా పరాయిదాన్నా వదినా?"

బాబుని ఎత్తుకుంటూ అడిగాను

"అదికాదు మంజూ! అక్కడసలు ఇల్లు ఎట్లావుందో ఏమిటో? నేను ఇల్లు వదిలి ఏడెనిమిది నెలలయింది కదా? ఇంకనయినా వెళ్ళి ఇల్లు సర్దుకోబోతే ఎట్లా? మీ అన్నయ్యకి కూడా ఇబ్బందికదా? అయినా నువ్వు కూడా నాతో వస్తున్నావుగా? రేపట్నించీ సెలవుపెట్టు మీ కాలేజీకి ఒక వారం వుండివద్దువుగాని! నీకూ కాస్త మార్పుండాలి!"

వదిన అనునయంగా మాట్లాడుతోంది.

రెండుసార్లు పిల్లలు పుట్టిపోవడంవల్ల భయంతో నెల తప్పంగానేనో ఐదోనెలనో వదిన పుట్టింటికి వెళ్ళింది అవును ఇప్పటికైనా వెళ్ళి ఇల్లు సర్దుకోవాలి అదీగాక అన్నయ్యకి భోజనానికి అన్నిటికీ ఇబ్బందే – నాకు తెలీనిదేముంది

కానీ –

వాళ్ళు వెళ్ళిపోతే మళ్ళీ ఈ ఒంటరితనాన్ని– వూహించుకుంటేనే భయంకరంగావుంది

పోనీ – నేనూ వెళ్తేనో?

ఇరుగుపొరుగువాళ్ళ ఎకసక్కెం మాటలూ – అపహాస్యాలూ నేను భరించలేను

ఇక్కడైతే అలవాటయిన పరిసరాలు – అలవాటయిన మనుషులు – అసలిక్కడా నేను ఎవరిళ్ళకీ వెళ్ళను. అందరూ ఎన్నో నిష్ఠూరా లాడుతూ వుంటారు నాకు మనసుకి దగ్గిరగా వచ్చినవాళ్ళతో తప్ప నేను సన్నిహితంగా వుండలేను

మనసుకి ఒక్క మాట తగిలితే ఆ గాయం మానడానికి కొన్ని వారాలు పడుతోంది నాకు మళ్ళీ అన్నీ కోరి తెచ్చుకోలేను.

అట్లాగని వాళ్ళతో రాననీ చెప్పలేను



ఎట్లా వాళ్లని నొప్పించకుండా 'రాన'ని చెప్పడం ? ఆలోచిస్తున్నాను.

''ఏం. మంజూ మాట్లాడవేం ? మాతో రావడం ఇష్టం లేదా ? లేక మేము వెళ్లిపోతున్నా మని కోపం వచ్చిందా ?''

''ఊరుకో సుశీ – ఏమిటా మాటలు ? దాని క..రే మనసు బావుండడంలేదు మనతో తీసికెళ్ల డమే ఉత్తమం ఏమ్మా మంజూ–ఏమంటావు ?''

''సరే – అన్నయ్యా మీ ఇష్టం–'' అన్నాను

వదిన అన్నీ సర్దడం ప్రారంభించింది నా స్యూట్‌కేస్ కూడా వదినే సర్దుతోంది

భాగ్యమ్మగారు కూడా నాకు నాలుగు రోజు లయినా 'మార్పు' వుంటుందని సంతోషించింది.

''వెళ్లండమ్మగార్లూ – ఇంటిని గురించి మీరేం బెంగ పెట్టుకోవద్దు. ముఖ్యమైన గదులకి తాళం వేసెయ్యండి. మిగతావాటికి నేనున్నాను. కంటికి రెప్పలాగా చూసుకుంటాను – ఇంటిని - సామానునీను ! మీరొచ్చేదాకా నాదీ బాధ్యత'' అందావిడ.



నిజమే ఆవిడ చాలా నిజాయితీ గల మనిషి అట్లాంటావిడ దొరకడం నా అదృష్టం కాదూ?

సర్దుడయింది భోజనాలకి కూర్చున్నాం

ఆ రోజు ఎక్కడికీ వెళ్లలేదు

టెలిగ్రాం వచ్చింది

అన్నయ్య లేవబోయాడు — వద్దని చెప్పి నేనే చెయ్యి కడుక్కుని బయటికొచ్చాను. స్కూల్ వాళ్ల దగ్గిర్నించది.

మధుకి 'జాండిస్' వచ్చిందిట "వచ్చి తీసికెళ్లమని!" అది చూసేసరికి నాకు మతి పోయింది. కాలు, చెయ్యి ఆడలేదు.

గిర్రున కళ్లల్లో నీళ్ళు తిరిగాయి.

దుఃఖం పెల్లుబికి వచ్చింది. "భగవాన్ ఇదేమిటి? ఎక్కడికి నా కష్టాలకి అంతు?"

వెక్కి వెక్కి ఏడిచాను.

నేనెంతసేపటికీ లోపలికి రాలేదనో, లేకపోతే నా ఏడుపు వినబడిందో అన్నయ్యా, వదిన పరుగెత్తుకు వచ్చారు అన్నం దగ్గిర్నించి

"మంజూ ఏమిటిది? తప్పుకదూ? ఇప్పుడే మయిందనీ? పిల్లలన్నాక ఏవో ఒకటి వస్తూనే వుంటాయి. నాలుగు రోజుల్లో తగ్గిపోదూ? ఆ కారణంగా పిల్లాడు నీ దగ్గిరుంటాడు. లేకపోతే ఉంటాడా? అన్నీ మన మంచికే అనుకో — సరేనా?"

టెలిగ్రాం చూసిన అన్నయ్య నన్ను ఓదార్చాడు. వదిన నన్ను గుండెల కదుముకుంది.

అందులోనే ఎన్నో మాటలు స్ఫురించాయి నాకు: ఓదార్పు లభించింది

నన్ను నేను సంభాళించుకుని లేచి కూచున్నాను సోఫామీద.

"ఇప్పుడేం చేద్దాం?" వణికే గొంతుతో అడిగాను అన్నయ్య వైపే చూస్తూ

అసలేస్థితిలో వున్నాడో — ఎట్లా వున్నాడో — స్పృహ వుందో — లేదో — తగ్గుతుందా అసలు?— నా రాత ఎట్లా వుందో? పిల్లల్ని చూసయినా నా బాధలు మర్చిపోతాను నేను. అసలు నా బతుకే వాళ్లకోసం — మధు కేమయినా అయితే...? అమ్మో .. ఆ ఊహే భరించలేకపోయాను.

"మంజూ! నేను వెళ్లి మధుని తీసుకొస్తాను. మీ వదిన నీకు తోడుగా వుంటుంది. నువ్వు ధైర్యంగావుండు. నేనిప్పుడే వెళ్తున్నాను. వెళ్తూ మన డాక్టర్ని మీటయి వెళ్తాను. నేను మధుతో తిరిగిరాగానే ఆయన ఇక్కడికి వచ్చేటట్లు ఏర్పాటుచేసి వెళ్తాను. ఈలోగా ఒకసారి వచ్చి నిన్ను కలవమనికూడా చెప్తాను. జాండిస్ అంటే ఈరోజుల్లో తగ్గడం చాలా సులభం. నువ్వు మాత్రం డీలాపడిపోకూడదు. సుశీ — జాగ్రత్త!"

పదే పదే హెచ్చరించి వెళ్లిపోయాడు అన్నయ్య. అన్నయ్య వెళ్లిపోయాక మరీ బాధ ఎక్కువయింది నాకు. జాండిస్‌తో పోయినవాళ్లంతా గుర్తొస్తున్నారు. భయం ఇంకా ఎక్కువయింది.

మోకాళ్ళల్లో తల దూర్చి ఏడ్చాను.

వదిన వారించింది.

"మంజూ! ఛీ! నీకేమన్నా పిచ్చా ఏం? తప్పు అట్లా ఏడవగూడదు. జాండిస్ ఎంతమందికి వచ్చి తగ్గిపోవడంలేదు? మా తమ్ముడికి వచ్చిందొకసారి తెలుసా? దానివల్ల ఏమీ ప్రమాదం లేదు కాబోతే అది రెసిడెన్షియల్ స్కూలు కదా ఇంకెవ్వరికీ అంటుకోకూడదని వాళ్ల జాగ్రత్తకోసం ఇంటికి పంపిస్తున్నారు అంతే! అదీగాక ఇంటి దగ్గిరయితే పథ్యం పానం కుదురుతాయి. అందుకే తీసికెళ్లమన్నారు సాధారణంగా పిల్లలు వంట్లో బాగాలేకపోతే అమ్మదగ్గిరుండాలని కోరుకుంటారు అంతే! ఇంకేంలేదు. నువ్వట్లా బాధపడుతూ కూచోకు. నా మాట విను వాడీపాటికి రేపు చెంగున ఆడుతూవుంటాడు — నువ్వే చూస్తావుగా?"

నాకు వదిన మాటల్లో 'అంటుకోకూడదు' అనే మాట మళ్లీ మళ్లీ వినబడుతోంది. ఇంకేం మనసులో చొరబడలేదు.

వదిన ఈ మాట ఇంకో అర్థంతో అనలేదు కదా? సూటిగా వదిన కళ్లకేసే చూశాను.

ఆమె కళ్ళు నిర్మలంగా వున్నాయి. ఆ కళ్ల నిండా నామీద సానుభూతీ — జాలీ వున్నాయి. అంటే నా ఆలోచనకి నేనే సిగ్గుపడ్డాను.

"వదినా — మధు వచ్చేలోగా నువ్వూ — బాబూ యిక్కణ్నించి వెళ్లిపొండి — మళ్లీ వాడికి అంటుకుంటే కష్టం కదా? పసివాడుకూడా నాయె! నువ్వు మాత్రం? బాలింతరాలివి కదా."

మనస్ఫూర్తిగా అన్నాను.

నా నోరు టక్కున మూసేసింది వదిన.

"నన్నెంత స్వార్థపరురాలిగా — తక్కువగా అంచనా వేశావు మంజూ!"

వదిన కళ్లనించి నీళ్ళు రాలిపడ్డాయి.

"నీ బాధలకి నిన్నొదిలి — నా దోవ నేను చూసుకుంటానా? ఇదే నా బిడ్డయితే నేను వదిలేసి వెళ్తానా? ఇప్పుడు నేనే నీకు తల్లి నమ్మా!..." అంతకంటే మాట్లాడలేకపోయింది వదిన.

గట్టిగా కౌగిలించుకున్నాను వదిన్ని — మనసారా! "ఇంక నాకేం దిగుల్లేదు వదినా — దిగుల్లేదు."

## 8

"అమ్మా."

నీరసంగా పిల్చాడు మధు.

'ఏం నాన్నా—' ఉలిక్కిపడి లేచాను

'మంచి నీళ్లు కావాలి —'

ఇచ్చాను

తాగి పడుకున్నాడు కానీ నిద్రపోలేదు ఇంటి కప్పుకేసే తదేకంగా చూస్తున్నాడు

"పడుకో నాన్నా నిద్రపో!" అన్నాను మీద చెయ్యివేస్తూ

"అమ్మా, నాకు తగ్గుతుందా?"

వాడు అడిగే విధానానికి నాకు కడుపు తరుక్కుపోయింది.

"తప్పకుండా తగ్గుతుంది నాన్నా! ఎందుకు తగ్గదూ? అసలు నువ్వు వచ్చినప్పటికన్నా తగ్గిందిప్పుడు." అనునయంగా అన్నాను.

అది అబద్ధం! అసలు తగ్గు మొహమే పట్టలేదు. మధు వచ్చి వారమయింది తీవ్రంగానే వచ్చింది జాండిస్ వాడికి. పిల్లాడు చిక్కి శల్యమయ్యాడు. కళ్లు బాగా పచ్చగా వున్నాయి అరికాళ్లు, అరిచేతులు కూడా పచ్చగా వున్నాయి. పడుకున్న పక్కంతా పసుపురంగుకి మారిపోతోంది ఈ పిల్లాడు మళ్లీ మామూలుగా తిరుగుతాడా? అసలు బతుకుతాడా?

అహర్నిశలూ ఇదే ఆలోచన నాకు

డాక్టరు తన శక్తివంచనలేకుండా ప్రయత్నం చేస్తూనేవున్నాడు తగ్గించడానికి. అతి శ్రద్ధగా చూసుకుంటున్నాడు అయినా ఏమిటో తగ్గడంలేదు. నాకు చాలా ఆందోళనగావుంది

ఎన్నో దేవుళ్లకి మొక్కుకున్నాను

నేను మొదట్లో రోజూ ఒక గంట దేవుడికి పూజ చేయందే ఏ పనీ చేసేదాన్నికాదు. ఏరోజు చెయ్యకపోయినా ఏమిటో లోపంగా వుండేది అట్లాంటిది నా సంసారమిట్లా అయిపోయాక



# డాక్టర్ సలహాలు

డి. వి. ఎల్ — తెనాలి

ఏదైనా ప్రమాదంలో వెన్నెముకకు దెబ్బ తగిలితే దాంపత్య జీవితానికి అర్హులు కారా?

★ వెన్నెముకకు దెబ్బ తగిలినంత మాత్రాన దాంపత్య జీవితానికి అనర్హులని మీఅంతట మీరే నిర్ణయించుకోవటానికి ఆధారాలేమిటి?

వెన్నెముకలో దెబ్బతగిలినప్రాంతాన్నుసరించి, ఏయే భాగాల నరాలు దెబ్బతిన్నాయో తెలుస్తుంది. అయినా జననేంద్రియాలకి వెళ్లే నరాలు అంత తేలిగ్గా బాధింపబడవు. వెన్నెముకకి దెబ్బతగలగానే లేనిపోని అపోహలతో మానసిక దౌర్బల్యానికి గురి అయి వారంతట వారుగానే దాంపత్య జీవితానికి అనర్హులమనే భావన తెప్పించుకొంటేతప్ప, నూటికి 85 శాతం ఈ అపోహలో నిజం చాలా దూరం.

ఎస్. వి కె బి. — పెడన

నా వయస్సు 25 సం.లు. నాకు 6 సం.ల క్రితం రొమ్ములో చిన్నగడ్డగా వచ్చినది క్రమేణా పెద్దదయినది. తరువాత సం లో రెండవ రొమ్ములో వచ్చినది నొప్పిగా వుంటుంది. డాక్టరు సలహాపై మందులు వాడినాను. ప్రయోజనము కన్పించలేదు మీ సలహా తెల్ప ప్రార్థన.

ఈ ''గడ్డ''ను ఫైబ్రో అడినోమా అని అంటారు. దీనికి ''బ్రెస్ట్ మౌస్'' అనే పేరు కూడా వుంది. ఎందుకంటే దీనిని రొమ్ము భాగంలో సులభంగా కదిలించవచ్చు గనుక

సాధారణంగా ఈ గడ్డలు రెండువైపులా కొద్ది కాలవ్యవధిలో ఏర్పడుతాయి. వీటికి నివారణోపాయం శస్త్రచికిత్స మాత్రమే! ఈ చికిత్స చాలా సులభమైనది. ప్రమాదం ఏమాత్రం లేదు. అశ్రద్ధచేస్తే ఇతరత్రా ఏవైనా క్లిష్టమైన రోగాలు రాగల అవకాశం వున్నది.

కె ఎస్ — కారంచేడు

నా వయస్సు 18 సంవత్సరములు. నాకు తొడల దగ్గర దురదవల్ల గోకితే పుండ్లు పడుచుండెను. దురద,పుండ్లు పోయే మందు చెప్పవలసినదిగా కోరుచున్నాను.

★ ఈ దురదకి కారణం — ''టీనియా క్రూరిస్'' అనే ఫంగస్.

దీని నివారణకి గ్రైసోవిన్ మాత్రలు రోజుకి ఆరు వంతున వరుసగా 20 రోజులు లోనికి తీసుకోవటం, పై పూతగా కెనలాగ్ స్కిన్ ఆయింట్‌మెంట్ గాని, విట్‌ఫీల్డ్ ఆయింట్‌మెంట్ గాని పూయవలసి వుంటుంది. వీటికి తోడుగా శరీరంలో రోగ నిరోధక శక్తి పెరగటానికి మల్టీ విటమిన్ మాత్రలు రోజుకి రెండు వంతున ఒక నెలైనా వాడవలసి వుంటుంది.

ఎల్. ఆర్. బి. — కాకినాడ

'డయాలసిస్' అంటే ఏమిటి? ఈ రోగ లక్షణములు నివారణోపాయములు వివరించండి.

★ మూత్రపిండాలు సక్రమంగా పని చేయక పోయిన సందర్భంలో శరీరంలో మలిన ధాతువులు చేరి రోగికి కొన్ని అవాంతరాలను, కొన్ని సమయాలలో ఊపిరికే ప్రమాదమూ కలుగ జేస్తాయి

కొన్ని రసాయనిక ద్రవ్యాల ద్వారా రోగి శరీరాన్ని శుభ్రపరచి ఈ మలినాలని నిర్మూలించే విధానాన్నే ''డయాలిసిస్'' అంటారు.

డయాలిసిస్ అనేది రోగంకాదు కాబట్టి రోగలక్షణాల మాటే రాదు. అదేవిధంగా నివారణోపాయం గురించి ప్రసక్తే లేదుగా!

ఎస్. వి ఎల్. — చిక్కాల

నా వయస్సు 15 సం లు నాకు కాళ్లపై ఎర్రని మచ్చలు వున్నవి. అవి 'బొల్లి' అని అన్నారు. ఇవి తగ్గటానికి మందులు వున్నాయా? ఇవి అంటువ్యాధా? ఇది శరీరమంతా ప్రాకే అవకాశ మున్నదా? నాకు వివాహమైన తర్వాత నా పిల్లలకు గూడా ఈ వ్యాధి వచ్చే అవకాశ మున్నదా?

★ ఈ బొల్లి అనే మచ్చలు, శరీరంలో మెలనిన్ అనే పిగ్‌మెంట్‌ని చర్మంలోని జీవకణాలు (సెల్స్) తక్కువగా ఉత్పత్తి చేయటంవల్ల ఏర్పడుతాయి.

జీవకణాలకి ఇలా తక్కువగా నల్లరంగుని ఉత్పత్తిచేసే తత్వం పుట్టుకతోనే ఏర్పడుతుంది. కానీ, ఈ తత్వం బయటపడటానికి కొన్ని సం.లు పట్టవచ్చును. ఇది తగ్గటానికి మందులు లేవు.

ఇది అంటువ్యాధి మాత్రం కాదు. వివాహ మయిన తర్వాత పిల్లలకి వచ్చేదీ రానిదీ చెప్పటం కష్టం.

— డా॥ క. వెంకటేశ్వరరావు

---

దేవుడు — పూజ అంటే నమ్మకం పోయింది.

కానీ మళ్లీ ఇప్పుడు కష్టసమయంలో దేవుణ్ణి వదలడంలేదు నేను. మొక్కులు, ముడుపులూను. మనకి ఆపదల్లోనేనా దేవుడు గుర్తుకివచ్చేది? లేదు లేదు. అది చాలా తప్పు భగవంతుడు అన్ని వేళలా మనల్ని కాపాడుతూనేవుంటాడు. ఆయన్ని మనం నమ్ముకునివుంటే అన్యాయం చెయ్యడు. దయామయుడు మనం త్రికరణ శుద్ధిగా నమ్మాలి అంతే! ఇది తెలుసుకోలేక పోవడం మన అజ్ఞానం.

కళ్లు మూసుకుని మనసారా ఆ ఏడుకొండల వాణ్ణి వేడుకుంటున్నాను రోజూ — నా తప్పులని క్షమించి - నా మధుని కాపాడమని. మధుకి తగ్గాక వాడితో తిరుపతి వస్తానని మొక్కుకున్నాను

కాలేజీకి సెలవు పెట్టాను.

రాత్రింబవళ్లూ మధు మంచం వదలడంలేదు నేను

కావలసినవన్నీ అందిస్తోంది వదిన.

అన్నయ్య మామూలుగానే బెజవాడ వెళ్లి అప్పుడప్పుడు వస్తున్నాడు.

సాధ్యమయినంతవరకు వదిన్ని మధు దగ్గిరికి రానీడంలేదు నేను

పిల్లవాణ్ణి అసలీ ఛాయలకి కూడా రానివ్వడంలేదు.

## రాగమాలిక

'అమ్మా!'' మళ్లీ పిల్చాడు మధు.

''ఏమ్మా మధూ?'' అడిగాను.

''నాకు కడుపులో ఏదోగా వుందమ్మా! వాంతి అయ్యేటట్లుగా వుంది.''

''లే నాన్నా! మెల్లగా బాత్‌రూమ్‌కి వెళదాం.'' అనేలోగానే వాంతి అయిపోయింది

అంతా పసరే!

నా కళ్లుతిరిగిపోయాయి. గుండె దడదడ లాడింది.

తోటకూరకాడలా వాలిపోయాడు మధు.

నేను గుండె కుదుటపరుచుకుని వణికే చేతులతో మూతి తుడిచాను. దుప్పటితీసి వేరేది మార్చాను. మధుని జాగ్రత్తగా మంచంమీద పడుకోబెట్టాను. వాడు సొలిపోయినట్టు పడుకున్నాడు. పిలిచినా కళ్ళు తెరవలేదు. మన స్పృహలో లేడసలు నాకు భయమేసింది.

అన్నయ్య వూళ్లో లేడు

వదిన నిద్రపోతోంది.

నేనే వెళ్లి డాక్టరుకి ఫోన్ చేశాను అర్జెంటుగా రమ్మని!

తెల్లవారుఝామున రెండు గంటలయింది — అప్పుడు. మధు దగ్గిరే కూచుని వాడి తల నిమురుతూ మొహం చూశాను పీక్కుపోయింది — మొహం. మంచానికి బల్లిలాగా అంటుకుపోయి వున్నాడు వాడు.

ఎంత చలాకీగా — ఎంత చిలిపిగా వుండేవాడు ఎట్లా అయిపోయాడు?

వచ్చే ఏడుపుని ఆపుకున్నాను డాక్టరుగారు వచ్చారు.

పాపం — ఆయన కాబట్టి ఈ వేళలో కూడా పిలవంగానే వచ్చారు.

కన్నీళ్లతోనే అంతా చెప్పాను.

పరీక్షించారు ఏదో ఇంజక్షన్లు యిచ్చారు.

''డాక్టరుగారూ — ఫరవాలేదంటారా?'' భయంగా అడిగాను

''ఏం భయం లేదమ్మా — వాంతి అవడం మంచిదే —'' అన్నారు

కానీ, ఆయన ముఖం చూస్తే నాకేదో భయమేసింది —

''మీ అన్నయ్యగారు లేరా?'' అని అడిగారు

''లేడండీ — బెజవాడ వెళ్లాడు. రేపు పొద్దున వస్తాడు. ఏమన్నా చెప్పాలా?''

అంతలో వదిన లేచి వచ్చింది

డాక్టరుగారు వదిన్ని అవతలికి తీసికెళ్లి ఒక అయిదు నిమిషాలు ఏదో మాట్లాడారు.

''వస్తానమ్మా — రేప్పొద్దున్నే మళ్లీ వస్తాను మీరేం కంగారు పడకండి!'' అని వెళ్లిపోయారు

[ఇంకా వుంది]

# ప్రశ్నావళి

— కె. రామలక్ష్మి

ఎ. వి. ఆర్. — సికింద్రాబాదు

మనిషి చేసిన మంచి చెడులకి అతడే ఫలితం అనుభవిస్తాడు కదా ? మరి సంఘం ఎందుకతన్ని వేలెత్తి చూపడం ?

★ మనిషి సంఘంలో వాడు కాదా ? చూడండి. మనిషి తాను చేసిన 'చెడు'ని తనకే ఎలా అట్టే పెట్టుకోలేడో 'మంచి'ని కూడా అలాగే అట్టే పెట్టుకోలేడు. కొలనులో రాయి విసిరితే లేచిన తరంగాలు రాయి నంటిపెట్టుకునా— వుండిపోతున్నాయి ? సరస్సు యావత్తూ ఆక్రమించుకోడంలేదా ? - అలాగే మనిషి చేసిన మంచి చెడుల ఫలితాలూ — సంఘంలో విస్తరిస్తాయి.

ఎ. వి. ఎస్. — పొదలకూరు

ఏమండీ మీ రచయిత్రులకు మగవాళ్లంటే ఎందుకంత కోపం ?

★ మగవాళ్లంటే కాదు— ఆడ పేర్లతో రాసే మగవాళ్లంటేనే — కోపం— కాదు, అసహ్యం. కలం పేర్లు, పేర్లు కావా? నిజమైన స్త్రీ రచయితల్లాగా చెలామణీ కావాలని వీరు పడే తాపత్రయం చూస్తే ఎవరికేనా అసహ్యం వేస్తుంది... హైద్రాబాదు ఎగ్జిబిషన్‌లో స్త్రీల దినం రోజు బురఖా వేసుకొని తిరిగే మగవాళ్లలాగా — వీళ్లని చూస్తే — జాలి వేస్తుంది. ఎందుకో యీ తాపత్రయం ?! దొంగపేర్లు ఆడపేర్లే ఎందుక్కావాలి ? ఆడపేర్లే అయినా 'యిది కలం పేరు' అని సూచించే కొటేషన్ మార్కు లెందుకు పెట్టుకోరు ?!

ఎ. వి. ఎల్. — వెంకటగిరి

ఎంతోమంది స్త్రీలు వెలుగులోకి రాలేక, రావాలని ప్రయత్నించినవారికి ఎన్నో కష్టాలు ఎదురౌతాయి. వారి సమస్యలకు పరిష్కారం అంటూ దొరకదు. జీవితాలు కన్నీటిమయం కావటం చూస్తున్నాం ... నా స్నేహితురాలు ...

★ కథ మామూలే! ప్రేమించింది మరోకులంవాడిని. పెళ్లి చేసుకుందాం అనుకున్నారు ఇద్దరూ. మరిక ఈ లేచిపోవడం దేనికి ?! ఆర్థికంగా స్వంత కాళ్లమీద నిలబడగ్గినవారికీ, మైనర్లు కానివారికీ — ప్రేమా పెళ్లి స్వతంత్రం గాని .. ప్రేమించేసి అదే పరమార్థం అని లేచిపోడం — పిరికితనం. దాన్ని పెద్దలు హర్షించలేదని వాపోడం — మరీ చిన్నతనం. అంచేత 'వెలుగులోకి రాడం' కన్నీటి గాథలుగా మారడం - కాల్పనిక సాహిత్యంలో మాటలుగాని వాస్తవ జీవితాలకి పునాదిరాళ్లు కావు. ముందా సంగతి గమనించాలి — ప్రేమించేసుకునే యువతీ యువకులు.

ఎస్. ఎ. ఆర్. — నందికొట్కూరు

కాలేజీలలో మగవాళ్లను కూడ ఏడిపించే అమ్మాయిలను మీరు సమర్థిస్తారా ?

★ మగవాళ్లను కూడా అంటే మీ ఉద్దేశ్యం నా కర్థంకావడంలేదు ! అల్లరి చేసిన ఎవరినైనా అవకాశం దొరికితే తిరిగి అల్లరిపెట్టడం — సహజమేకద !

పతంజలి — బిలాస్‌పూరు

తెలియని విషయాలను సాటి మహిళ ఎంత అర్థవంతంగా పాఠకులకు చెప్తున్నారో కొంతకాలం అసిస్టెంటుగా చేరి తెలుసుకోండి ..

★ పతంజలీ ! ఏం సూచన ఇచ్చావయ్యా ! ఆడదాని చేతికింద ఉద్యోగమా!? ఏదీ ఆ మహిళ — తానే ఒక మిథ్య అంటూంటే - నేనెలా చచ్చేది ?!

టి. ఎస్. ఎస్. — పలాస

మనిషికి జీవితంలో ప్రేమలు ఆదరణలు ముఖ్యమా ? లేక డబ్బు ముఖ్యమా ?

★ డబ్బుంటే — ప్రేమలూ ఆదరణలూ అవే వస్తాయనడం — నిజం. కాని అలా అంటే మండిపడతాం — నిజం నిష్ఠూరంగా వుంటుంది కనుక ! అంచేత బుద్ధిమంతులలాగా నేను — తరతరాల ప్రేమా — త్యాగాదులూ, ఆదరణ అభిమానాలూ వాటి చరిత్రా పుట్టు పూర్వోత్తరాలూ వల్లెవేసి — ప్రేమ శాశ్వతం డబ్బు బుద్బుదప్రాయం అనేయాలి ! అప్పుడు చదివిన మీరు ఆహా ఏం విజ్ఞానఖని యీవిడగారు అని మెచ్చుకుంటారు. అవునా ? (లేకపోతే అడిగిన దానికి సూటిగా బదులు చెప్పక యీ రొష్టు దేనికి ? అనుకున్నా అనుకోవచ్చు.)

సి. వి. జి. పి. — నంద్యాల

మీరు నూరేది కారాలా ? మిరియాలా ?

★ కష్టపడి నూరడం ఎందుకు రడీగా పొడుం దొరుకుతూంటే ! ముక్కలుడికించివడేసి కాస్త యిదీ కాస్త అదీ జల్లుతానంతే !

కె. కె. ఆర్. — హైదరాబాదు

మీ సమాధానాల పద్ధతిని ముందు నిర్ణయించుకోండి. అవి విజ్ఞానానికా ? హాస్యానికా ? వీరత్వానికా ? సాంఘిక సంక్షేమమునకా ? మానవ జీవనం మెరుగుపరచడానికా ? రాజకీయమునకా ? నాస్తికత్వమునకా ?... ఈ విధంగా ఏదో పద్ధతిని అనుసరించి రాస్తే బాగుంటుంది.

★ నిజమే ! ఇప్పుడు మీ సూచన అమలులోకి తేవాలంటే — కొత్తగా వస్తున్న పత్రికల్లోలాగా సెక్షన్ సెక్షన్‌గా పెట్టుకోవాలి. "హాస్యం కావాలా ? హాస్య ప్రశ్నలు చూడండి !" అన్నాననుకోండి — ఎలా వుంటుంది. చూడండి రావుగారూ, ఎవరి ధోరణి వారికి వుంటుంది. అది — పుర్రెతో పుట్టిన బుద్ధిలాంటిదే వదలదు !

సుమిత్ర — విజయవాడ

అటు మీరేమో భార్యాభర్తలు కత్తెరకు రెండు రెక్కలంటారు. ఇటువైపునుండి "మొల్లలివి నన్నేలు నా స్వామికి" అంటూ స్త్రీ తనను తాను వందడుగులు కిందికి తొక్కుకుని భర్తని వందడుగులు పైకెక్కిస్తోంది. ఏలడం ఏలబడటం వుంటే సమానత్వం అనే మాటకు అర్థం లేదుకదా? అసలీ పాట రాసిన కృష్ణపక్షపు కృష్ణశాస్త్రిగారి దెంత పక్షపాతవైఖరి ?

★ ఏకాంతంలో భార్య భర్తకు దాస్యం చేసిందా, భర్త భార్యకు దాస్యం చేశాడా అన్నది కాదు — అసలు ప్రశ్న. ఒకరిమీద ఒకరికి గౌరవం వుందా అన్నది ముఖ్యం. మనలో మన మాట కృష్ణపక్షపు కృష్ణశాస్త్రిగారికి స్త్రీ జన పక్షపాతం మాత్రమేగాని స్త్రీజాతిపై అత్యున్నతాభిప్రాయం — వుందా లేదా చెప్పలేం ! అది మరీ వ్యక్తిగత విషయంకద !

జె. బి. ఆర్. - అత్తిలి

జీవితంలో ఎన్నో కష్టనష్టాలకు ఓర్చుకుని జీవన యాత్ర సాగించిన చివరి క్షణంలో ఆ జీవిని మంచంమీదనుంచి క్రిందికి దింపేస్తారు ఎందుకని?

★ ప్రాణం పోడానికి ముందే — ఏదీ వెంట రాదని గ్రహించడం మంచిదని కబోలు ! మనవన్నీ మరీ క్రూడ్ పద్ధతులు. చచ్చేదాకా ఎంత అబ్బురంగా చూస్తామో మరుక్షణం — అంత నిర్లక్ష్యంగా చూస్తాం ! బతికుండగా తిండి పెట్టడానికి ఏడ్చేవాళ్లే చచ్చాక తద్దినాలనీ కర్మలనీ కావలసినంత తగలేస్తాం... ఇది చాలు మన ద్వంద్వ ప్రమాణాలకి నిదర్శనకి. చచ్చాక నలుగురి కోసం చేసే ఈ తతంగాలకంటే — బతికున్నప్పుడు సహృదయంతో చూడ్డం నేర్పగల్గితే చాలు మన పిల్లలకి.

ఆంధ్ర తుఫాన్ ప్రాంతాలలో పర్యటించిన రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి



## సినిమా విశేషాలు

### పాట చిత్రీకరణకు లక్ష

అగ్ర దర్శకుడు శ్రీ దాసరి అపురూపంగా సృష్టిస్తున్న "దేవదాసు మళ్లీ పుట్టాడు" వర్ణ చిత్రం ఆఖరి షెడ్యూలును సమీపించింది

డిశంబర్ షెడ్యూలులో రెండు పాటల చిత్రీకరణతోబాటు పతాక సన్నివేశానికి దారితీసే సన్నివేశాల చిత్రీకరణ పూర్తయింది

"అగ్రనటి" వాణిశ్రీ పాల్గొన్న ఒక వూహాగీతిక చిత్రీకరణకు మాత్రం లక్ష ఖర్చయినట్టు, నిర్మాత శ్రీనివాసులు చెప్పారు చిత్రంలో యీ దృశ్యం మనోహరంగా వుండడానికి దర్శకుడు శ్రీ దాసరి కొత్త స్కీమును ప్రవేశపెట్టారు. అజంతా ఎల్లోరా శిల్ప సౌందర్యాన్ని తలదన్నే శిల్ప కళా వైభవాన్ని యీ పాట చిత్రీకరణ కోసం, శ్రీ దాసరి చేయించారు

"పాట లేకుండా . నేపథ్య సంగీతానికి ప్రాధాన్యతనిస్తూ యీ సన్నివేశం చోటు చేసుకుంది" అన్నారు అగ్రదర్శకుడు

### రాముడు కాదు కృష్ణుడు

దేవీ ఆర్ట్ ప్రొడక్షన్స్ నిర్మాత శ్రీనివాసులు గారికి, తరువాతి చిత్రం కూడా



'చిలిపికృష్ణుడు'లో వాణిశ్రీ

ఆ బలాధ్యులతోనే తీసే నిర్ణయం వచ్చింది.

"అగ్రదర్శకుడు" శ్రీ దాసరి గీచిన గీత దాటని శ్రీనివాసులు గారికి, శ్రీ అక్కినేని ప్రోత్సాహం మరింత బలాన్ని చేకూర్చింది.

శ్రీ నాగేశ్వరరావు పుట్టిన రోజున (సెప్టెంబర్ 20 న) ప్రారంభించనున్న కొత్త చిత్రానికి "రాముడు కాదు కృష్ణుడు" అని పేరిడబోతున్నట్టు, శ్రీనివాసులు తెలిపారు.

కథ ... మాటలు ... చిత్రానువాదం ... దర్శకత్వం బాధ్యతలను శ్రీ దాసరి నిర్వహించగలరని, శ్రీనివాసులు చెప్పారు.

### శివరంజని

తారకప్రభు ఫిలింస్ అనెడి సంస్థను ప్రముఖ దర్శకుడు శ్రీ దాసరి స్థాపించి, తొలి ప్రయత్నంగా ఒక "న్యూవేవ్" చిత్రాన్ని నిర్మించ నిశ్చయించారు

ఆ చిత్రానికి "శివరంజని" అని పేరు పెట్టారు. జనవరి 17 న పాట రికార్డింగ్ జరపడానికి నిశ్చయించారు.



'నాయుడుబావ'లో జయప్రద



'చల్ మోహనరంగ'లో దీప



'పట్నవాసం'లో విజయనిర్మల

### జగపతి చిత్రానికి జనవరి ముహూర్తం

అన్నపూర్ణా స్టుడియోస్ ... జగపతి పిక్చర్స్ సినిమా స్కోప్ వర్ణ చిత్రంగా తలపెట్టిన "రామకృష్ణులు" జనవరి ఎనిమిదో తేదీన పాటల రికార్డింగ్ ముహూర్తాన్ని, జనవరి ఇరవై నుంచి షూటింగ్ ముహూర్తాన్ని నిర్ణయించినట్లు, దర్శక ... నిర్మాత శ్రీ రాజేంద్రప్రసాద్ తెలిపారు.

తెలుగు చలనచిత్రరంగంలో కనివిని ఎరుగని దృశ్యాల సమిష్టికరణ "రామకృష్ణులు" వర్ణ చిత్రంలో ఎదురుచూచే ప్రేక్షకులకు, వారి ఊహలకు అనుగుణంగా వుండే కథావిధానాన్ని శ్రీ రాజేంద్రప్రసాద్ సృష్టించారు.

### నటరాజద్వయం

రాజ్యమేలుతున్న "నటరాజద్వయం" శ్రీ ఎన్టీఆర్, శ్రీ ఏ. ఎన్. ఆర్. ఈ చిత్రంలో నాయక పాత్రలను పోషించ, భవిష్యత్తును బంగారువంట చేసుకోనున్న జయసుధ...జయప్రద నాయిక వేషాలను "రామకృష్ణులు" చిత్రంలో ధరిస్తున్నారు.

"రామకృష్ణులు" వర్ణ చిత్రానికి ఆచార్య ఆత్రేయ, మహదేవన్, వి ఎస్ ఆర్ స్వామి, సంజీవి, కృష్ణారావుగార్లు ముఖ్య శాఖలకు అధిపత్యం వహిస్తున్నారు

జనవరి నుంచి మే వరకు షూటింగు కార్యక్రమం పూర్తిచేసి, జూన్‌లో అన్నపూర్ణా ఫిలింస్ ద్వారా "రామకృష్ణులు" స్కోప్ చిత్రాన్ని శ్రీ రాజేంద్రప్రసాద్ విడుదల చేస్తారు.

### కరుణామయుడు చిత్రానికి నాగార్జునసాగర్

రాధ చిత్ర రంగుల్లో నిర్మిస్తున్న ఏసుప్రభు జీవిత చరిత్రను "కరుణామయుడు" పేరిట ప్రపంచ ఖ్యాతి నందే విధంగా నటుడు శ్రీ విజయ చందర్ రూపొందించడానికి, దర్శకుడు భీంసింగ్ తన మేధాశక్తిని ప్రదర్శిస్తున్నారు.

"కరుణామయుడు" వర్ణ చిత్రాన్ని చూచిన కొందరు విదేశీయులు ఏసుప్రభు మరో జన్మ ఎత్తారా అని విజయచందర్‌గారి ఆహార్యంపట్ల ఆశ్చర్యాన్ని ప్రకటించారు.

ఈ చిత్రానికిగాను, నాలుగు "ల"కారములు ఖర్చెట్టి, నాగార్జునసాగర్ వద్ద పతాక సన్నివేశ చిత్రీకరణ ... క్రూసిఫికేషన్ పాట చిత్రీకరణ జనవరి మొదటి పదిరోజుల్లో పూర్తిచేస్తున్నారు

# సినిమా

## నిండుమనిషి విడుదల ఎప్పుడు ?

లక్ష్మి ఫిలింస్ కంబైన్స్ రంగుల్లో నిర్మించిన "నిండుమనిషి" చిత్రాన్ని సంక్రాంతికి ఆశించారు ప్రేక్షకులు. చిత్రాన్ని చూచినవాళ్ళు శ్రీ శోభన్‌కు "నిండుమనిషి" నూతనోత్సాహాన్ని యిచ్చే ఫలితాన్ని యివ్వగలదని చెపుతున్నారు.

తండ్రి పాత్రలో కరుణరసాన్ని యెంత సమర్థవంతంగా పోషించారో...కుమారుడుగా శృంగారరసాన్ని అంత రమణీయంగా పోషించారు.

ఆయన ఎన్నో చిత్రాల్లో నటించిన పాత్రలకు... "నిండుమనిషి" చిత్రంలోని పాత్రలకు యెంతో తారతమ్యత వైశిష్ట్యం వుంది.

## దర్శకుని ప్రశంస

శ్రీ ఎస్. డి. లాల్ శోభన్‌బాబుగారి నటనపట్ల అమితానందాన్ని ప్రకటించారు. తనకు శోభన్‌తో "నిండుమనిషి" మొదటి చిత్రమే అయినా, నటుడుగా ఆయనకున్న "యీజ్"ను శ్రీ లాల్ అభినందించారు. ఒక మంచి చిత్రాన్ని ఖర్చుకు వెనకాడక...నిర్మాత శ్రీమతి అనురాధాదేవి తనకు అన్ని వసతులను ఇచ్చినట్టు శ్రీ లాల్ కొనియాడారు.

"నిండుమనిషి" చిత్రానికి సంగీత దర్శకుడు శ్రీ సత్యం సమకూర్చిన నేపథ్య సంగీతాన్ని, ఛాయాగ్రహణ ప్రతిష్టతను చూపెట్టిన శ్రీ బాలకృష్ణను శ్రీ లాల్ శ్లాఘించారు.

ఈ చిత్రంలో జనరంజకమయ్యే అన్ని "పట్లు" వుండడంవల్ల, దీనిపై తనకు ప్రగాఢ నమ్మకం వున్నదని, శ్రీ లాల్ వివరించారు.

ఈ చిత్రంలో జయచిత్ర, దీప, సత్యనారాయణ, రాజబాబు, పూడా, జి. వరలక్ష్మి, విజయకుమార్ ముఖ్య నటులు.

## లక్ష్మీరమణలో శోభన్

"ఇంటింటి కథ" చిత్రాన్ని అందించిన లక్ష్మీరమణ కంబైన్స్ కొత్త సంవత్సరం మూడో మాసంలో ప్రారంభించదలచిన వర్ణ చిత్రానికి శ్రీ శోభన్ నాయకుడుగా ఎంపిక అయినట్టు నమ్మకంగా తెలిసింది.

ఒక గ్రామ యువకుని జీవిత కథపై నిర్మించబోయే యీ చిత్రానికి అగ్రదర్శకుడుగా ప్రశంసింపబడుతున్న వ్యక్తి సారథ్యం వహించే సానుకూలత కనిపిస్తున్నది.

శ్రీ కామినేని ప్రసాద్, శ్రీ కామారి కృష్ణ యీ చిత్రానికి నిర్మాతలు.

రెండు మాసాలలో ఆంధ్ర కోస్తా ప్రాంతంలోని పైరు పచ్చని గ్రామంలో యీ చిత్రం షూటింగు జరుగుతుందని తెలిసింది.

## విఠలాచార్య జానపదం

అంటే బండ్లు కట్టుకుని వచ్చి జనం తెగ చూసేవారు... ఆ రోజుల్లో. మనిషిని ఎలుగుబంటుగా, కుక్కను మనిషిగా, పామును ఆవుగా, మేకను చీమగా తన సినిమాల్లో మాయాజాలాన్ని ప్రవేశపెట్టి, ప్రేక్షకుల దర్శకుడయ్యారు, శ్రీ ఆచార్య.



'సతీసావిత్రి'లో రామారావు

కాలం తెచ్చిన మార్పు, జానపదాలకు గిరాకీ తగ్గింది. మళ్ళీ జానపదాల యుగం ప్రారంభమయ్యే సూచనలు ఎక్కువగా కనిపిస్తున్నాయి.

ఈ తరుణాన్ని విఠలాచార్యగారు "మిస్" చెయ్యదలచలేదు. అందుకనే, మాయా మంత్ర తంత్ర మహిమాన్వితమైన జానపద కథను సృష్టించారు. "జగన్మోహిని" అని పేరు పెట్టారు.

ప్రభ... నరసింహ రాజు... సారథి... జయమాలిని ముఖ్య పాత్రలను పోషించగలరని ఆచార్య తెలిపారు. ఆచార్య నిర్మిస్తున్న తొలి రంగుల చిత్రం యిది.

[34వ పేజీ చూడండి]

# జి. వి. జి. పేజీ

## నిరాశా నిస్పృహలు

"ఏమండీ! మీరు లోగడ పిక్చర్‌ను రిలీజ్ చేసి రెండు మూడేళ్ళయింది. ఇంత పెద్ద 'గేప్' ఇచ్చారు. కొత్త పిక్చర్ను ఎప్పుడు ప్రారంభిస్తున్నారేమిటీ ?'' అని అడిగాను ఓ నిర్మాతను.

"ఏం, బాబూ! నేనిలా బాగుండడం మీకిష్టంలేదా ?'' అన్నాడా నిర్మాత.

''అదేమన్నమాట ? ఒకవైపున కొత్త చిత్రాలు ప్రారంభమౌతూనే వున్నాయి మరోవంక పోటీలమీద చిత్రాలు విడుదలవుతూనే వున్నాయి. మరి, మీకొచ్చిన ఇబ్బంది ఏమిటి ?''

''ఒకరో ఇద్దరో తప్ప మిగతావాళ్ళంతా ఏం బావుకుంటున్నారో ఎవరికి తెలియదు గనుక. ఆ మిగతావాళ్ళు ఏదో సినిమాలు తీశామంటే తీశామని తీసేస్తున్నారేగాని సీరియస్‌గా ఎవరు తీస్తున్నారండీ ? నేనేదో నా పాతచిత్రాల మీద వచ్చే కాస్తో కూస్తో డబ్బుతో నిశ్చింతగా ఇలా కాలక్షేపం చేస్తున్నాను. ఒక విషయం ఆలోచించండి. నాగిరెడ్డిగారికి సొంత స్టూడియో వుంది. అర్థబలం, అంగబలంలో ఆయన తర్వాతే కదా ఎవరైనా ? మరి, ఆయనెందుకు తెలుగు చిత్రాలు తీయడంలేదు ? ఎ. వి. ఎం. వాళ్ళు కూడా మళ్ళీ ఎందుకు తెలుగులో తీయడంలేదు ? వీటన్నటికీ సమాధానం ఒక్కటే — ఆ మంచిరోజులు పోయాయండి. ఇప్పుడంతా ఒక్క 'వేగం' మాత్రమే కనిపిస్తోంది. తొందరపడి సినిమాలు తీసేయడం, హడావిడిగా విడుదల చేసేయడం. ఫలితాలు కూడా అంత త్వరలోనే తేలిపోతున్నాయి. అంచేత, మళ్ళీ ఆ మంచిరోజులు వచ్చేవరకు నేను మళ్ళీ చిత్ర నిర్మాణానికి పూనుకోదలచలేదు,'' అన్నాడా నిర్మాత.

"ఇంతకీ, ఆ మంచిరోజులంటే ఏమిటి ? ఎప్పుడొస్తాయి ? ఎలా వస్తాయి ?'' ఈ ప్రశ్నలను మరో నిర్మాతను అడిగాను.

''త్వరలోనే,'' అన్నాడాయన.

''ఎలా ?''

"నేను ఇప్పుడప్పుడే కొత్త పిక్చర్‌కు పూనుకోదలచలేదు. నన్ను మార్గదర్శకుడిగా భావించి మరొకరిద్దరు కూడా చిత్రాలు ప్రారంభించలేదనుకోండి. అలా చిత్రాల సంఖ్య తగ్గుతుందికదా ? క్వాన్టిటీ తగ్గేకొద్దీ క్వాలిటీ పెరుగుతుంది. ఆర్టిస్టుల డిమాండ్ అంతో ఇంతో తగ్గుతుంది. అలా చిత్ర నిర్మాణ వ్యయాలన్నీ తగ్గుముఖం పెట్టొచ్చు. క్రమక్రమంగా ఇండస్ట్రీ బాగుపడొచ్చుకదా ?'' అన్నాడాయన.

మనసులోనే నవ్వుకున్నాను.

ఇంకో నిర్మాతను కదిలించి చూశాను.

''ఇప్పుడెక్కడ చూసినా 'కొరత' అనేది కనిపిస్తోందండి. పిక్చర్ ప్రారంభిద్దామా అంటే ధనాభావం. డిస్ట్రిబ్యూటర్లు మునుపటిలా ప్రోత్సహించడంలేదుకదా ? సరే ... డబ్బుకు ఎలాగో తంటాలుపడ్డామనుకోండి. మంచి కథల కరువు. ఏదో ఇతర భాషా చిత్రాల హక్కులు కొన్నామనుకుందాం. హీరోయిన్ల కొరత. 'కొత్తవాళ్ళు — కొత్తవాళ్ళు' అని ప్రజలు ఎంతో తహతహలాడిపోతున్నట్లు గోలచేస్తారేకాని, కొత్తవాళ్ళు పెట్టి తీసిన చిత్రాలెన్నింటిని వీరు ఆదరించి నిర్మాతలను ప్రోత్సహించారో చెప్పమనండి. సరే ... ఏ తమిళ, మళయాళ తారనో పెట్టి చిత్ర నిర్మాణానికి పూనుకున్నామనుకోండి — ముడి ఫిలిమ్ కొరత. ఆ సమస్యను కూడా యెలాగో అధిగమించి చచ్చీచెడీ చిత్రం పూర్తిచేశామనుకోండి. ఆ తర్వాత పంపిణీదారుల తోడ్పాటు కొరత. జిల్లాలవారీగా అమ్మేశామనుకోండి. థియేటర్ల కొరత. ఇన్ని కొరతలనూ తట్టుకొని ఎలాగో రిలీజ్ చేశామనుకోండి. థియేటర్లలో ప్రేక్షకుల కొరత !'' అంటూ నవ్వేశాడా నిర్మాత.

ఇలా నిరుత్సాహంతో నిర్మాతలలో ఒక వర్గం కనిపిస్తున్నా — మరో వర్గంవారు చిత్రాల నన్నాహాలతో చాలా హడావిడిగా కనిపిస్తున్నారు.



'డూ డూ బసవన్న'లో సుమ్మడి, అంజలి



'సీతామాలక్ష్మి'లో ఒక దృశ్యం



'అల్లరి బుల్లోడు' లో...

# జి. వి. జి. పేజీ

### 1977 — 1978

కొత్త సంవత్సరం గత ఏడుకన్నా బాగుండా లని అన్ని రంగాలలోనివారూ ఆశపడడం సహజమే. 1977లో విడుదలైన పెక్కు చిత్రాలలో విజయవంతమైనవాటిని వేళ్ళమీద లెక్కపెట్ట వచ్చు. కనీసం 1978లో అయినా విజయవంత మయ్యే చిత్రాల సంఖ్య కాస్తో కూస్తో ఎక్కువవు తుందని ఆశించడంకన్నా ఎవరూ చేయగలిగిందేమీ లేదు.

1977 చివరను మన కోస్తా ప్రాంతంలో చండమారుతం పెక్కు కష్టనష్టాలపాలు చేసింది. ఈ తుఫాను ప్రభావం చిత్రాల వసూళ్ళమీదకూడా అంతో ఇంతో కనబడింది. చలనచిత్ర పరిశ్రమ లోని వారంతా గతంలోలాగే సహృదయోత్సాహంతో స్వచ్ఛందంగా ముందుకు ఉరికి, ఉప్పెన బాధితుల పరిహార నిధి సేకరణకు ఎంతగానో తోడ్పడ్డారు.

### తారల పెళ్ళిళ్ళు

షూటింగ్ల మధ్య విరామ సమయాలలో జోక్‌లు వేసుకునే తారలు కూడా కొందరున్నారు. ''మంజుల కూడా వివాహం చేసేసుకుంది. ఇక నీ వివాహం ఎప్పుడు ?'' అని ఓ తార అడిగితే, ''మంజులకుమల్లే యిదివరకే వివాహితుడైన భర్త దొరికే అదృష్టం ఉండొద్దూ ?'' అని జవాబిచ్చింది మరో తార. ''ఇంతకీ, ఈ మధ్య వీళ్ళంతా హడావిడిగా ఎందుకు పెళ్ళిళ్ళు చేసేసు కున్నారు చెప్మా!'' అని మొదటి తార అంటే, ''ఏముందీ — ఆ హీరోగారు తన హీరోయిన్‌లకు పుట్టే కూతుళ్ళ పక్కనకూడా తాను ఉత్తరోత్తరా నటిస్తానని ఏ సుముహూర్తాన సెలవిచ్చారోగాని వీళ్ళంతా తొందరపడి పెళ్ళిళ్ళు చేసేసుకున్న ట్లుంది'' అని చమత్కరించింది మరో తార.

### నాలాగ ఎందరో

ఆర్. కె. ఆర్ట్స్ ప్రొడక్షన్స్‌వారి ద్వితీయ చిత్రానికి పై పేరు పెట్టదలచినట్లు తెలిసింది. డిసెంబర్ 12 నుంచి జనవరి నెలాఖరు వరకు ఏకధాటిగా హైదరాబాద్ పరిసరాలలో పూర్తిగా ఔట్‌డోర్‌లో తయారౌతుందని నిర్మాత కె. రంజిత్‌కుమార్ తెలియజేశారు. నారాయణ రావు, లక్ష్మీకాంత్, హేమసుందర్, దాశరథి, రూప, పల్లవి, రాధికా కిరణ్ ప్రధాన తారాగణం. కథ, మాటలు : గణేశ్ పాత్రో. సంగీతం : ఎం. ఎస్. విశ్వనాథం. ఛాయ : లోకనాథ్. శిల్పం : సూరపనేని కళాధర్. స్క్రీన్‌ప్లే, దర్శకత్వం : ఈరంకి శర్మ.

### సీతాలుకి తర్ఫుదు

కొండయ్య చెప్పింది విని, ''అలాగా ! అయితే, మన-సీతాలు గొప్ప యోగ జాతకురాల్రా !'' అని ఆశ్చర్యపోయాడు స్టేషన్ మాష్టర్. ''కానండయ్యా...దాని మాటే కాస్త తిరకాసండీ— తమకి తెల్సుగా ? నాలిక మహా మందం. తనురు నాలికని సిత్రిక పట్టేసి, మంచి మంచి అచ్చరాలూ, బాసా నేర్పేశారంటే మీ పేరు సెప్పుకుంటాను'' అని కొండయ్య అవగానే ''దానికేం — మన చేతుల్లో విద్య'' అంటూ స్టేషన్ మాస్టర్ హార్మోనియం తీసుకొని, ''ఆ... మహాభారతంలో డీసిల్ ఇంజన్ లాంటి ఒక పద్యం చెప్తాను. కనకోర్వీధర...'' అని ప్రారంభించేసరికి విని పారిపోతున్న సీతాలు చెయ్యి పుచ్చుకొని లాక్కొచ్చాడు. సీతాలుకి ఆ సమాసాలు నోరు తిరక్క అవస్థపడింది. ''విష్వక్సేనుడు — అని స్వచ్ఛంగా అనగలిగితే, 'రాముడు' అన్న పేరు ఇట్టే వచ్చేస్తుంది కదా?'' అన్నాడు స్టేషన్ మాస్టర్. ''నిజమే అనుకోండి. కాని, దాని నోరు తిరిగే పాటో, పద్యమో చెప్తే...'' అని సూచించాడు కొండయ్య. ''అంటే, భావగీతం లాంటిదన్న మాట !'' అన్నాడు స్టేషన్ మాస్టర్. సీతాలు బెదిరిపోయి, ''అదెట్టా ఉంటదో ?'' అని రహస్యంగా అడిగితే, ''భావగీతా లంటే — బావ మీద పాటలన్న మాట'' అని భాష్యం చెప్పాడు కొండయ్య. కొండయ్య, సీతాలు, స్టేషన్ మాస్టర్‌లుగా చంద్రమోహన్, తాళ్ళూరి రామేశ్వరి, వంకాయల సత్యనారాయణమూర్తి నటించే యువ చిత్రవారి ''సీతామాలక్ష్మి'' చిత్రం తుది మెరుగులు దిద్దుకుంటోంది. దర్శకత్వం : కె. విశ్వనాథ్. నిర్మాత : కె. మురారి. సమర్పణ : కె. నరసింహం.

''మంచి బాబాయ్'' లో



# ఈ 8 కారణాలకోసం...

























# భారతపు ప్రథమ ప్రెషర్ కుకర్ నేడు కూడా విపులంగా ఉపయోగింపబడుతున్నది



**Prestige**

ప్రెస్టీజ్
టి టి. (ప్రైవేట్) లి.
బెంగళూరు—560 016

MCA/TT/50-Tel

## ఫిల్మోత్సవ్

జి. వి. జి. పే జీ

మద్రాసులో జనవరి 3 నుంచి 17 వరకు జరిగే 'ఫిల్మోత్సవం'లో అల్జీరియా, అర్జెంటైనా, బల్గేరియా, బ్రెజిల్, కెనడా, జెకొస్లొవేకియా, ఈజిప్ట్, ఫ్రాన్స్, పశ్చిమ జర్మనీ, తూర్పు జర్మనీ, గ్రీస్, గయానా, యునైటెడ్ స్టేట్స్, జపాన్, స్వీడన్, టునీషియా వగైరా 35 దేశాలకు చెందిన 56 విదేశ చిత్రాలు దేవి, దేవి పారడైజ్, సత్యం, ఈగా థియేటర్లలో ప్రదర్శింపబడతాయి. 34 భారతీయ చిత్రాలు కూడా ప్రత్యేకంగా సఫైర్ థియేటర్‌లో చూపబడతాయి. ★

# ఉప్పెన వచ్చి పోయాక నెల తర్వాత...



ఉప్పెన వచ్చిపోయాక సరిగ్గా నెల తరువాత డిసెంబర్ 19వ తేదీ సాయంకాలం — అవనిగడ్డ తాలూకా భావదేవరపల్లిలో తీసిన బొమ్మలు యివి — ఇక్కడ కనపడేవి జిల్లా పరిషత్ హైస్కూలు శిధిలాలు — ఈ స్కూలులో పాత భవనం పడిపోకుండా వున్నదికాని రికార్డులు లైబ్రరీ పుస్తకాలు, ఫర్నిచర్ అంతా చిందరవందర అయి నాశనమైపోయివున్నది. దాని కెదురుగా ఇటీవల కట్టిన స్కూలు కట్టడం మొత్తం తుత్తునియలై కుప్పకూలిపోయింది — దీనిలో పరిసరాల నుంచి గ్రామంలో నుంచి వచ్చిన వందలాది మంది తలదాచుకున్నారట — కాని శిథిలాలను యింకా ఇట్లాగే వుంచేయడంతో వాటి క్రింద ఎన్ని శవాలు వున్నది తెలియదు — ఆ ప్రాంతాన మరుభూమిలో మృత్యుంజయులై తిరుగుతున్న అదే స్కూలు పిల్లలు — ఉప్పెననాటి గాధలు చెబుతూవుంటే కళ్లు చెమర్చాయి !

స్కూలు వెనుక ఒక గోతిలో పదిహేను కళేబరాలను పూడ్చివేశారని ఒక బాలుడు శివరామప్రసాద్ ఆ ప్రాంతాన్ని చూపెడుతూ అన్నాడు — [ క్రింద ఫొటోలో చూడండి ] ఇంకా రెండు మృతదేహాలు సమాధికికాని, అంత్యక్రియలకు కాని నోచుకోకుండా కుళ్లిపోతూ అక్కడపడి కనపడుతున్నాయి. నెలరోజులైనా యీ ఉప్పెనదెబ్బ తిన్న ప్రాంతాలు ఇంకా కళావిహీనంగా వున్నాయి. పంటకోతలతో క్రిస్మస్, సంక్రాంతి పండుగలకు స్వాగతం చెబుతూ ఈపాటికి కళకళలాడవలసిన ప్రాంతాలలో ఇప్పుడిప్పుడే పునరావాస కార్యక్రమాలు తలయెత్తుతూవుండటంతో — పై సంక్రాంతి నాటికే గాని కోలుకోలేరన్నంత దీనంగా వున్నారు గ్రామీణులు — పిల్లలు మాత్రం ఆటవిడుపు ధోరణిలో కనపడ్డారు — అయితే యీ డెల్టా ప్రాంతం తిరిగి కోలుకుంటుందన్న ఆశ మాత్రం అంతటా వున్నది. ప్రపంచంలోని అందరి సానుభూతి వీరిపట్ల వున్నది. [ ★★★ ]



# టూకీగా టాకీ న్యూస్

★ రాబోయే అక్టోబర్ నుంచి శ్రీ జగదీష్ చంద్ర ప్రసాద్‌కు శ్రీ దాసరి కాల్‌షీట్లు యిచ్చినట్టు తెలిసింది.

శ్రీ సింగీతం శ్రీనివాసరావు దర్శకత్వంలో యూరోగా ఒకచిత్రం నిర్మాణంకాగలదని తెలిసింది.

★ తిరుపతి పిక్చర్స్ శ్రీ ఎన్టీ ఆర్... శ్రీ రాఘవేంద్రరావు కాంబినేషన్‌తో నిర్మించబోయే జానపద చిత్రంలో వాణిశ్రీ నాయికగా నిర్ణయం అయినట్టు తెలిసింది. ఈ చిత్రంలో ఆజాను బాహులు, మరుగుజ్జులు ముఖ్య పాత్రధారులుగా వుండగలరు.

★ ప్రఖ్యాత దర్శకుడు శ్రీ తాతినేని ప్రకాశరావు దర్శకత్వంలో పద్మజా ఆర్ట్ పిక్చర్స్ పతాకంపై కోగంటి కుటుంబరావు నిర్మించిన "చిరంజీవి రాంబాబు" చిత్రం పూర్తయింది. జమున, మంజుల, రంగనాథ్, బాలయ్య బేబి రోహిణి, అల్లు రామలింగయ్య, సారథి, కొమ్మినేని శేషగిరిరావు, సుజాత, అనిత, గిరిజారాణి, త్యాగరాజు, మాస్టర్ రాము, జయమాలిని, సూర్యచంద్రరావు, అప్పారావు ముఖ్య పాత్రలను పోషించిన ఈ చిత్రానికి కథ, మాటలను వేటూరి, సంగీతాన్ని జె. వి. రాఘవులు, ఛాయాగ్రహణాన్ని యస్. యస్. లాల్, కళను భాస్కరరాజు, కూర్పును మోహన్ సమకూర్చారు. "పుట్టుకలో ఏం వుంది గొప్పదనం. తన నడవడిక ద్వారా పుట్టిన వూరుకీ, పెరిగిన పరిసరాలకీ, గొప్పతనాన్ని తేవాలి. పిల్లల్ని అతి గారాబంతో పెంచితే ప్రమాదాలొస్తాయి. పిల్లలు చేసిన తప్పుల్ని ఖండిస్తేనే క్షేమకరం. పిల్లలు చెడు త్రోవలో పడ్డారే అని పిదప చింతించి లాభంలేదు. పిల్లలకు పెట్టేటప్పుడు పెట్టాలి. వాళ్ళి కొట్టేటప్పుడు కొట్టాలి" అనే అంశంపై అల్లబడిన కథే "చిరంజీవి రాంబాబు."

★ కె. హేమాంబరధరరావు గారికి ఒరిస్సా చిత్రరంగం సుస్వాగతం పలికింది. ఒరియా భాషలో వారు డైరెక్టు చేసిన రెండు చిత్రాలు విజయవంత మయ్యాయి. మరో మూడు చిత్రాలు వారి కొచ్చాయి. ఒరియాలో ప్రప్రథమంగా నిర్మింపబడే "దేవదాసు" చిత్రాన్ని హేమాంబరధరరావు డైరెక్టు చేయడం గమనార్హం.

★ ప్రముఖ ఛాయా గ్రహణ దర్శకుడు వి.యస్.ఆర్.స్వామి అపర్ణా మూవీస్ పతాకంపై నిర్మించే వర్ణచిత్రానికి పి.సాంబశివరావు దర్శకత్వం వహిస్తారని తెలుస్తుంది.

★ మారుతీకంబైన్స్ శ్రీ వి. లక్ష్మికుమార్ సమర్పణలో నిర్మిస్తున్న "అల్లరి బుల్లోడు" (హీరో కృష్ణ, జయప్రద ముఖ్య జంట) చిత్రం జి. సి. శేఖర్ దర్శకత్వంలో శరవేగంగా తయారౌతుంది. డిశంబర్‌లో విడుదల చేయాలనుకుంటున్నట్టు నిర్మాత ఏ. గోపాలకృష్ణ తెలియచేసారు.

**—శ్రీనివాస్ ★**

---

బెల్లం నగరం అనకాపల్లిమీద, పరిసరాలమీద శారదానది ఉప్పొంగి విరుచుకుపడి నవంబర్ మూడోవారంలో మున్నెన్నడూలేని భీభత్సాన్ని భీతావహాన్ని సృష్టించింది



# ఇప్పుడు! చురుకైన జీవనంకోసం శక్తినిచ్చే యింధనాన్ని సేవించండి.




# బూస్ట్

## మాల్ట్ చాకొలెట్ మిల్క్ డ్రింకు

రైలు మోస్తరుగానే మీకు కూడా ప్రతీ రోజు ఉత్సాహంగా, ప్రారంభించేందుకు ఇంధనం కావాలి. అందుచేతనే ప్రతీ ఉదయం మీరు బూస్ట్ సేవించాలి.

మీరు చకచకా పనులు చేసుకొనడంలో మీకు తోడ్పడే శక్తిదాయకమైన ఇంధనం. ముఖ్యంగా పనిలోను, ఆటల్లోను అదనంగా శక్తిని వెచ్చించే మీ పిల్లలకు ఇది కావాలి.

వారికి బూస్ట్ యివ్వండి. ఇది మాల్ట్ చాకొలెట్ మిల్క్ డ్రింకు. పౌష్టికాహారం గురించి సంపూర్ణంగా తెలిసిన 'హార్లిక్స్' ఉత్పత్తిదారులు తయారు చేసింది.

సంపన్నమయిన క్రీమ్‌తో కూడిన బూస్ట్ మీకు మరింతగా శక్తినిస్తుంది ఎందుచేతనంటే ఇది సంపూర్ణమయిన మీగడ పాలతోను, గోధుమతోను, బార్లీ మాల్ట్‌తోను, కోకోతోను తయారయింది.

బూస్ట్‌లో మీ పిల్లల పెరుగుదలకుగాను, ఇటువంటి మరే ఇతర చాకొలెట్ డ్రింకులోను లేనంత ఎక్కువగా పౌష్టిక పదార్థాలు ఉన్నాయి.

అంతేకాదు. బూస్ట్‌కి, మీ కుటుంబమంతా కూడా యిష్టపడే క్రీమ్ మాల్ట్ చాకొలెట్ రుచి, సువాసన ఉన్నాయి. బూస్ట్, మీ రోజుని ప్రారంభించేందుకు ఖచ్చితమైన మార్గం—ప్రతీ రోజు.

రెండు సైజులలో లభిస్తుంది.

## 'హార్లిక్స్' ఉత్పత్తిదారులనుంచి.

B-4576-TEL-1




## యెలిమెంటు

(18వ పేజీ తరువాయి)

ఇంక తెలుస్తుంది !'' అన్నాడు వాడు సమాధానంగా.

అంతలోనే చటోపాధ్యాయ తన అనుచరులతో కలిసి అటు వచ్చేడు.

''ఇంతకూ మనం 'వాకౌట్' ఎందుకు చేసేంగు:రూ ?'' అన్నారు కొంత మంది.

చటోపాధ్యాయ వాళ్ళవేపు హీనంగా చూసేడు 'ఆ విషయం మీరు అడగకూడదు, నేను చెప్పకూడదు' అన్నట్టున్నాయి అతని చూపులు.

కార్మికులందరూ తలో రకంగా మాట్లాడు కొంటున్నారు. కొంతమంది గుసగుసలాడు కుంటున్నారు. మరికొంత మందిదీనితో తమకేం సంబంధంలేనట్లు మీన మేషాలు లెక్క పెడుతూ నిలబడ్డారు. చాలా మంది చటోపాధ్యాయ చుట్టూ చేరారు. ఎవరి అనుమానాలు వాళ్ళు బయట పెడుతున్నారు.

ఈ రకమయిన కలకలం చటోపాధ్యాయకు నచ్చలేదు. క్రమశిక్షణ లోపిస్తే నాయకత్వం చేయటం మహా కష్టమని అతనికి తెలుసు. ఇంతకుముందు తాను చేయించిన రెండు సమ్మెలూ అందుకే విఫలమయ్యాయనీ తెలుసు. మనుషుల్నందరినీ ఒకే తాటిమీదకు తెచ్చి నిలబెట్టేవి కేవలం నినాదాలు మాత్రమేనన్న సంగతి అతనికి బాగా ఒంటబట్టింది.

అందుకే తను మాట్లాడబోయేముందు మరోసారి గొంతుచించుకొని ''యూనియన్'' అన్నాడు.

''జిందాబాద్ !'' అంటూ గొల్లుమన్నారు కార్మికులు.

''మేనేజ్‌మెంట్...'' అన్నాడు.

సగంమంది ''డౌన్‌డౌన్'' అన్నారు.

సగంమంది ''జిందాబాద్'' అన్నారు.

చటోపాధ్యాయ కళ్ళలో రక్తం జేవురించింది. అతని ముఖం కోపంతో, అసహనంతో కందగడ్డలా అయిపోయింది.

''నేను 'మేనేజిమెంట్' అంటే అందరు 'డౌన్ డౌన్' అనాలి'' అన్నాడు ఆవేశంగా.

అంతలో ఒకడు ముందుకొచ్చి ''అదేమిటి బ్రదర్! నాలుగు దినాల క్రితమే కదా, మేనేజిమెంట్ అంటే జిందాబాద్ అనాలని చెప్పేవు'' అంటూ తన సందేహాన్ని వ్యక్తం చేశాడు

''అప్పుడు బోనస్ ఇచ్చారు కనుక అలా అన్నాం. ఇప్పుడు మనల్ని 'ఎక్స్‌ప్లాయిట్' చేసి పెత్తనం చలాయిస్తున్నారు కనుక డౌన్‌డౌన్ అనాలి'' అంటూ విషయాన్ని విశదీకరించాడు.

మొత్తానికి పరిస్థితి అంతాగోలగా తీన్ తేరాగా తయారయింది.

అంతలో పాలకవర్గంవారు సంభాషణలకు పిలుస్తున్నారని కబురొచ్చింది

చటోపాధ్యాయ మరి నలుగురు అనుచరులతో కలిసి లోనికి వెళ్ళాడు.

''మీరు ఇలా ప్రతి చిన్న విషయానికీ 'వాకౌట్' చేయటం బాగులేదు''. అన్నారు

పాలకవర్గంవారు.

''ఇలా ప్రతి చిన్న విషయంలోనూ మీరు అధికార దర్పం చూపించటం కూడా బాగు లేదు'' అన్నాడు చటోపాధ్యాయ.

''ఇందులో అధికార దర్పం చూపించట మేముంది? బజారులో చేపలు దొరక్కపోతే కేంటీను మేనేజరు మాత్రం ఏంచేయగలడు మేం మాత్రం ఏం చేయగలం? బజారులో చేపలు ఎందుకు దొరకటంలేదో తెలుసు కొమ్మంటే ఇప్పుడే ఇద్దరు సభ్యులతో ఒక కమిటీ వేస్తాం. వాళ్లు సంగతి తెలుసుకొని నివేదిక మనకి ఈ వారంలో ఇస్తారు. అంతే కాని ప్రతి చిన్న విషయానికి మీరు 'వాకౌట్' చేస్తే మేం కంపెనీ 'లాకౌట్' చేయ లసి వుంటుంది'' అన్నారు పా.వ.వారు.

''ఎలా 'లాకౌట్' చేస్తారో చూస్తాం. మేం ఈ క్షణం నుంచీ మా 'వాకౌట్'ని సమ్మెగా మారుస్తున్నాం. గేటు దగ్గర శిబిరం వేసుకొని నిరశన వ్రతం ఆరంభించ బోతున్నాం'' అంటూ చటోపాధ్యాయ ఆవేశంగా కుర్చీలోంచి లేచాడు. అతనితో బాటే అతని అనుచరులూ లేచారు.

గదిలోంచి అయిటికి వెళ్ళిపోతూంటే మంత్రిగారు ఎదురొచ్చేరు తలమీది టోపీ సర్దుకుంటూ సంగతి విచారించేరు.

''మీరు సంగతి తేలకుండా సంభాషణ ఆపేసి ఇలా బయటకు రావటం బాగులేదు మీ ఇరుపక్షాలకూ మధ్య సఖ్యత కుదర్చ టానికి నేను సరాసరి ఇంద్ర ప్రస్థం నుండి వచ్చేను. లోపలకు పదండి!'' అంటూ కార్మిక నాయకుల్ని మళ్ళీ సంభాషణలకు కూర్చోబెట్టారాయన.

ఇంద్రప్రస్థం నుండి వచ్చిన మంత్రి వరేణ్యులు చాలా ఘనులు. అంతకు ముందు రోజే బెంగాల్‌లో రెండు సమ్మెలు ఆపు చేయించి, రెండు కంపెనీలు మూయించి ఈ దినం ఇక్కడికి వచ్చేరు. ఈ దినం రాత్రిలోగా ఇక్కడి సమస్యను పరిష్కరించి మరునాడు మరో ఊరికి వెళ్లాలాయన!

''అయితే చేపల కూర గురించి ఇంత గొడవచ్చి పడిందన్నమాట...'' అంటూ అర్థోక్తిగా ఆగేరు మంత్రి వరేణ్యులు.

తరువాత ఇరుపక్షాల నుండీ వ్యవహారం విన్నారు.

విన్న తరువాత ఇరుపక్షాలతోనూ సంప్ర దింపులు విడివిడిగా జరిపేరు.

కాఫీ ఫలహారాలు ముగించి మళ్లీ 'మీటింగు' పెట్టేరు.

''చేపలు బజారులో ఎందుకు దొరకటం లేదన్నది నాకు అనూహ్యమయిన సంగతిగా వుంది. అందునా ఈ వూరు సముద్ర తీరంలో వుంది. చేపలు దొరకటం లేదంటే చాలా చింతించ వలసిన విషయం. ప్రస్తుతం మనకి చింతించటానికి టైము లేదు కనుక దానికి వేరే కమిటీ వేయిస్తాను. కాని, ఇలాటి కంపెనీలూ సమ్మె జరగట మంటే అది దేశ సౌభాగ్యానికి సంబంధిం చిన విషయం...'' మాటలు ఆపి ఇద్దరు టోపీ ఒకసారి సర్దుకున్నారు ''అసలే మన దేశంలో సున్నితమైన పరికరాల తయారీ కరువయి పోయింది. వాటిని దిగుమతి చేసుకునేందుకు చాలా విదేశీ మారకం నష్టమయి పోతోంది. 'ఇన్‌స్ట్రుమెంట్లు' తయారుచేసే ఈ కంపెనీలో ఒక్కగంట ఉత్పత్తి ఆగిపోతే అది దేశ సౌభాగ్యానికి ఎంతో నష్టం. అందుకని, మీరు వెంటనే పనుల్లో చేరిపొండి. చేపలు ఎందుకు దొరకలేదో, అసలు దొరక్క పోవటం నిజం అవునో కాదో నేనుస్వయంగా విచారిస్తాను'' అని గడగడా మాట్లాడి ఆయాసం తీర్చు కునేందుకు ఆగేరాయన.

చటోపాధ్యాయకు ఈ సలహా అంత రుచించలేదు.

''అదేం కుదరదు. వెనువెంటనే అసలు కారణం మీరు కనుక్కోవాలి. చేపలు దొరక్కపోవటమే నిజమయితే, అందుకు తగిన కారణం మీరు మాకు చెప్తే రేపే పనుల్లో చేరిపోతాం. లేదా మా సమ్మె కొనసాగిస్తాం. అయితే, పనిలోకి చేరాక మాత్రం మాకు మూడు రోజులు వరుసగా చేపలే వండించాలి.'' అన్నాడు.

ఇది కొంత సబబుగానే అనిపించింది మంత్రిగారికి.

చేపలు మార్కెట్టులోకి వచ్చేక వరుసగా మూడు దినాలు చేపలకూర వండించటానికి మేనేజిమెంటు వారిచేత ఒప్పించారు.

''ఆ విషయం మేం తప్పక ఆలోచించి ఆచరిస్తాం'' అన్నారు పా. వ. వారు.

సాయంకాలంలోగా చేపలు దొరకని కారణం విచారిస్తామని చెప్పి మంత్రిగారు హుటాహుటిని కారులో బయలుదేరి మార్కెట్టుకు వెళ్లారు.

ఆ వూరంతటికీ అదే పెద్ద బజారు. చిన్న వాన పడితే చాలు, బజారుమట్టూ చెరువులా తయారవుతుంది. వూళ్లోవాళ్లకు ఉచితంగా ఈతనేర్పే ఉద్దేశంతో ఆ వూరి

# యువతరం

**1960** సంవత్సరములో పామర్రులో పుట్టిన యస్. వి. సురేష్ ప్రస్తుతం విజయవాడలో బి. కాం చదువుకుంటున్నాడు. జిల్లా స్థాయిలో జరిగిన ''సైన్సు ఎగ్జిబిషన్'' లో ఫిజిక్స్ ప్రదర్శనలో రెండవ బహుమతిని అందుకున్న యితనికి కార్టూన్లు వెయ్యటం,



లైబ్రరికి వెళ్ళటం ముఖ్య హాబీలు. దాదాపు అన్ని మాస, వారపత్రికలలో తన కార్టూన్స్ ప్రచురింపబడినవని చెప్పాడు. కార్టూన్ అంటే ఏమిటి అని అడగగా 'హాస్యముతోపాటు చమత్కారము జోడించి యున్నదే' అని తన అభిప్రాయాన్ని వెల్లడించాడు. ఈ మధ్య ఇటువంటి కార్టూన్స్ రావటంలేదని ఫిర్యాదు చేస్తున్నాడు. ...పు, జయదేవ్, బాబు తన అభిమాన కార్టూనిస్టులన్నాడు. ఇతడు, కొంతమంది విజయవాడలోని కార్టూనిస్టులు కలిసి శ్రీ గీతా సుబ్బారావుగారి ఆధ్వర్యములో ''గీతా కార్టూనింగ్ ఇనిస్టిట్యూట్''ని స్థాపించారట! సినిమా తారలని, మంత్రులను చూడాలని కోరికవున్న ఇతడు కొంతమందినే చూడగలిగానని బాధపడ్డాడు. ఏ ఆట అంటే ఇష్టం అని అడిగినప్పుడు బాడ్మింటన్ ఆడతానని చెప్పాడు.

[ జె. పి. ]

## యెలిమెంటు

మునిసిపాలిటీవారు దయతలచి ఆ చెరువును అలాగే వుంచటం చాలా సంవత్సరాలుగా అలవాటు చేసుకున్నారు. మంత్రిగారు కారు దిగి వారి సెక్రటరీ సహాయంతో ఈదు కొంటూ మార్కెట్టులోకి ప్రవేశించారు. అయితే, మార్కెట్టు గేటు దాటి లోనికి వెళ్లటానిక్కి ఆయన కొంత కష్టపడవలసి వచ్చింది. ఎందుకంటే, దానికున్న గేటులు చాలా చిన్నవి. ఒక మామూలు మనిషి దూరటానికి మాత్రమే పనికి వస్తాయి. చాలా ఇరుకుగా దానిలోంచీ దూరి లోనికి వెళ్లేరు మంత్రిగారు ఇంత కష్టంమూపడి లోనికివెళ్తే మార్కెట్టులోపల ఒక్క చేప కూడా కనిపించలేదాయనకు. చేపలు అమ్మె కునే వాళ్లందరూ ఎండు చేపల్లా వున్నారు. అతి దీనమయిన ముఖాలతో ఖాళీగా పని లేకుండా కూర్చొని ఆడా మగా విబేధం లేకుండా తల్లో పేలు చూసుకుంటున్నారు. మంత్రిగారివంక ఒకమారు చూసి మళ్లీ వాళ పనిలో మునిగిపోయారు.

"చేపలమ్ముకునేవాళ్లు! చేపలమ్ముకునే వాళ్ళా! మీరు చేపలు ఎందుకు అమ్మటం లేదు ? మీరు చేపలు అమ్మకపోవటంవలన ఒక పెద్ద కంపెనీ సమ్మెలోకి దిగింది." అన్నారు మంత్రిగారు.

చేపలమ్ముకునే వాళందరూ పేలు చూసుకోటం మాని ఘొల్లుమని ఏడ్చేరు ! తరువాత మొత్తుకున్నారు ! ఆ తరువాత తిరిగ్గా ఏడుస్తూ మొత్తుకున్నారు ! మంత్రిగారు గాభరాపడిపోయారు ! వాళ్లెం దుకు మొత్తుకుంటూ ఏడుస్తున్నారో ఆయనకు అర్థంకాలేదు ! వాళ్ళు ఏడవటం పూర్తి అయ్యాక ముక్తకంఠంతో ఇలా అన్నారు. "మేవూ చేపలకోసమే కూకున్నా మండి ! మారు బేరగాళ్లు సరుకే తేవటం లేదు ! నాలుగు రోజులనుండి విర్రని ఏగానీ కూడా సూడలేదు."

మంత్రిగారు మారుబేరగాళ్ల దగ్గరకు వెళ్లారు.

మారుబేరగాళ్లు 'మారువాడీ' వాళ్లలా వున్నారు !

'మారు బేరగాళ్లు! మారు బేరగాళ్ళా! మీరు చేపలు ఏందుకు తేవటంలేదు ? మీ వలన ఒక పెద్ద కంపెనీ సమ్మెలోకి దిగింది'' అన్నారు మంత్రిగారు.

"మీరలా సెలవిస్తే ఏం సెప్పమండి?! అసలు జాలరోళ్లు ఎవరూ సముద్రంమీదికి ఎళ్లందే! ఈ నాలుగు రోజులనుండీ ఒక్క సేపయినా పట్టలేదు! ఎక్కడనుంచి తెమ్మంటారండి సేపలు? వంకాయలేటి సెట్కు దులిపి పట్టాడానికి?" అన్నారు కొంత రెచ్చిపోయి

నాలుగు రోజులబట్టీ కమీషను లేదని వాళ్లకి ఒళ్లు మంటగా వుంది! మంత్రిగారు వెంటనే జాలారివాళ్లు వుండే సముద్ర తీరానికి చేరుకున్నారు. కారు ఆగగానే నల్ల చేపలాటి జాలరివాళ్లు మెడలో ట్రాన్సిష్టర్లతో, కెమేరాలతో చుట్టుముట్టేరు.

"సార్! కెమేరాలుసార్!" అని ఒకడు; "స్మగుల్డు టేపు రికార్డరు వుంది చూపించమంటారా?" అని ఒకడు; "మంచి విస్కీ సార్! ఫార్టీ రుపీస్! నైస్ డ్రింక్!" అని మరొకడు; అందరూ తలోక రకంగా మాట్లాడుతూ మంత్రిగారి చుట్టూ మూగేరు.

"స్రెకటరీ! వీలు ఏదో చెప్తున్నారు చూడు!" అంటూ వాళ్లని స్రెకటరీకి అప్పజెప్పి ఆయన జాలరి గుడిసెల వద్దకు వెళ్లేరు

గుడిసెల దగ్గర ముసలివాళ్లు కూర్చొని వలలు అల్లుకుంటున్నారు. మరి కొంత మంది ట్రాన్సిష్టర్లు పెట్టుకొని వార్తలు, పాటలు వింటున్నారు.

"జాలరివాళ్లూ! జాలరివాళ్లూ! మీరు సముద్రం మీదికి వెళ్లి చేపలు ఎందుకు పట్టుకురాలేదూ? మీరు చేపలు తేని కారణంగా ఒక పెద్ద కంపెనీ సమ్మెలోకి దిగింది!" అన్నారు మంత్రిగారు.

"నాలుగు రోజుల క్రితం సుండి రోజా తుఫానొస్తుందని రేడియోలో సెప్తున్నారు సువ్వినుకోలేదేటి? పైగా, మాం సముద్రం మీదికి ఎందు కెల్లలేదని అడుగుతున్నావా? తుఫాను రాలేదు, వల్లకాడూ లేదు! ఈ నాలుగు రోజులూ మా నోటికాడ కూడడి పోవాది" అన్నాడొక ముసలాడు.

మంత్రిగార్కి అసలు కిటుకు తెలిసిపోయింది!

ఆయన తిన్నగా రేడియో కేంద్రానికి వెళ్లేరు!

'సార్! మా కోడి గుడ్డు పెట్టింది కాని పొదగటం లేదు! మీరు 'సలహాలు' కార్యక్రమంలో చెప్పినట్లు కూడా ప్రయత్నాలు చేసేం! అయినా పొదగలేదు! మీ కేంద్రానికి పంపితే పొదిగించి పంపగలరా?' అని ఎవరో సోమలింగపాలెం శ్రోత వ్రాసిన ఉత్తరానికి సమాధానం కోసం అందరూ కూర్చొని ఆలోచన సాగిస్తున్నారు.

కొందరు కోడిగుడ్డు పొదిగించి పంపటానికి ఏదైనా 'జి వో' వుందేమోనని వెదుకుతున్నారు.

మంత్రిగార్ని చూడగానే అందరూ లేచారు!

పనసకాయ దొరికినపుడే తద్దినం పెట్టాలన్న సంగతి వారికి అనుభవ పూర్వకంగా బాగా అర్థమయింది!

"సార్! 'కార్మికులు — సమ్మెలు' అనే విషయంపై మీతో 'ఇంటర్వ్యూ' చేద్దామనుకుంటున్నాం" అన్నారు వాళ్లు.

"ఇంటర్వ్యూ సంగతి తరువాత చూద్దాం అవతల కొంప మునిగింది!" అంటూ కొంతసేపు నిట్టూర్చి "రేడియో వాళ్లూ! రేడియోవాళ్లూ! తుఫానొస్తుందని నాలుగు రోజులుగా తప్పు 'ఎనవున్సుమెంటు' ఎందుకు చేస్తున్నారు?" అన్నారు.

"అవునుసార్! మేం చెప్పిన మాట నిజమే! తుఫాను రాని మాటా నిజమే! కాని అందులో మా తప్పేమీలేదు! అది వాతావరణ సంస్థ వారిచ్చిన భోగట్టా! మేం ఏమీ చేయలేము" అన్నారు ఏక కంఠంతో దీనంగా! ఆ 'మూడ్' చెదిరిపోతుందేమోనని ఒక రేడియో నాటిక రిహార్సల్ ప్రారంభించేరు వెంటనే!

మంత్రిగారు తిన్నగా వాతావరణ సంస్థ ఆఫీసుకు వెళ్లేరు.

"సంస్థవారూ! సంస్థవారూ! మీరు తుఫానొస్తుందని తప్పు భోగట్టా రేడియో వారికి ఎందుకిస్తున్నారు? మీ వలన పెద్ద కంపెనీ సమ్మెలోకి దిగింది!" అన్నారు.

"ఏం చెయ్యం సార్! 'రాడార్' లో ఒక 'ఎలిమెంటు' పాడయింది. అది తప్పుగా 'సిగ్నల్'ఇస్తోంది. ఆ 'ఎలిమెంటు' మార్చటానికి ప్రయత్నిస్తున్నాం. అంత వరకూ తుఫాన్ వస్తూనే వుంటుంది. మేం మాత్రం ఏం చేయగలం?" అన్నారు.

"ఆ 'ఎలిమెంటు' మీకు ఎవరు సప్లయి చేశారు?" అన్నారు మంత్రిగారు.

"బాబా ఇన్స్ట్రుమెంటు కంపెనీ అని ఈ వూర్లోనే వుంది" అన్నారు వాళ్లు.

మంత్రిగారి సమస్య విడిపోయింది! ఆయన హుటాహుటిని కంపెనీకి వచ్చేరు. "మీరు 'ఎలిమెంటు' సరిగ్గా చేయక పోవటంవలన ఈ అనర్థ మంతా వచ్చింది" అంటూ కథ అంతా వివరించేరు.

చటోపాధ్యాయకు ఇందులో న్యాయం కనుపించింది. మరునాడే కార్మికులు సమ్మె విరమించి పనుల్లో చేరిపోయారు. జాగ్రత్తగా పని చేసి దేశసౌభాగ్యానికి తోడ్పడతామని హామీలు ఇచ్చేరు.

మంత్రిగారు మరో సమ్మె సంగతి తేల్చడానికి విమానం ఎక్కేరు.



## "మిషీరియస్ బెలూన్"

ఇంద్రజాల ప్రదర్శనలో ఏ తరహా ప్రేక్షకు లకి ఎట్లాంటి ప్రక్రియలు ప్రదర్శిస్తే, ప్రదర్శన ప్రజారంజక మవుతుందో ఆలోచించి ప్రదర్శించడం ఎంతైనా అవసరం.

ఆ రోజు నవంబర్ 14 వ తేదీ, ఆదివారం ఉదయం 8 గంటలయింది.

పెద్ద చప్పుడు చేసుకుంటూ ఒక ఆటో రిక్షా మా యింటి ముందు ఆగింది. దాంటోంచి ఫుల్ సూట్‌లో వున్న ఎవరో యిద్దరు వ్యక్తులు దిగి, గేటు తెరచుకుని, బనీను, పంచ కట్టుకుని, తలకి తువ్వాలు చుట్టుకుని, చెట్లకు బోదెలు తీసి, నీళ్లు పోస్తున్న నన్ను సమీపించి...

'ఏ మోయ్! మెజీషియన్ కామేష్ యింట్లో వున్నారా?' అడిగారు.

'ఉన్నారండీ. మీరెవరు ?'

'ఎవరో లయన్సుక్లబ్ వాళ్ళొచ్చారని మీ అయ్యగారితో చెప్పు.'

"అట్లాగే, మీరు ఆ రూమ్‌లో కూర్చోండి" అని వాళ్ళిద్దరిని డ్రాయింగు రూమ్‌లో కూర్చోబెట్టి నేను యిల్లాలోపలికి వచ్చి, నా పూర్తి మెజిషియన్ సూట్ వేసుకుని అల్లా డ్రాయింగ్ రూమ్‌లోకి ప్రవేశించాను.

## స మో సా లు

కావల్సినవస్తువులు :- ¼ కే. జి. మైదా పిండి, ½ కె జి. మంచినూనె, వుల్లిపాయలు ¼ కే. జి., ¼ కే.జి. ఆలుగడ్డలు, పచ్చిమిర్చి, చిన్నఅల్లంముక్క, పొదీనా కట్ట 1, ఉప్పు, (ఏలకులు, లవంగాలు, షాజీర, ధనియాలు, జీలకర్ర, దాల్చినచెక్క, మసాల పొడికి)

తయారుచేయు విధం: - మైదా శుభ్రంగా జల్లించి వుంచుకోవాలి. గట్టిగా పూరీ పిండిలా కలపాలి. అలా వుంచి, వుల్లిపాయ ముక్కలు తరిగి, ఆలుగడ్డ ముక్కలతో కలిపి వుడికించాలి. పచ్చిమిర్చి, అల్లం చిన్న ముక్క మెత్తగా వుప్పువేసి దంచి, ఒకపక్క వుంచుకోవాలి. తగినంత కారం వాడవచ్చును. పొదీనా ఆకులు తీసి కడిగి వుంచుకోవాలి. గిన్నె కాలేసె కొద్దిగా నూనెవేసి కాగాక, ఎండు మిర్చి 2 కాయలు తుంచివేసి, 1 స్పూన్ ఆవాలు, మినప్పప్పు జీలకర్ర వేసి పోపుచేసి అందులో ముందుగా వుడికించిన, వుల్లిపాయ

# మాయాజాలం మతికట్టు

అంతే! యిద్దరూ లేచి నిలబడి, గుడ్ మార్నింగ్, మిష్టర్ కామేష్, ఐయామ్ లయన్ ప్రెసిడెంట్ కపాడియా, అండ్ హి యీజ్ లయన్ డకోటా (అని తనతో బాటు సెక్రెటరీని పరిచయం చేశాడు.)

"వెరీగుడ్ మార్నింగ్, ప్లీజ్ బి సీటెడ్, వాట్ కేన్ ఐ డూ ఫర్ యూ ?"

'వుయ్ వాంట్ యువర్ వేల్యుబుల్ సర్వీసెస్'

'సర్టెన్లీ యు ఆర్ వెల్‌కమ్, ఏమిటో చెప్పండి.'

"ఈ రోజు బాలల దినోత్సవం సందర్భంగా సాయంత్రం రవీంద్ర భారతిలో బాల బాలికలు వకృత్వపు పోటీలు పెట్టి మా లయన్స్ క్లబ్ తరపున విజేతలకి బహుమతి ప్రదానం మీ ద్వారా చేయిద్దామని నిశ్చయించుకున్నాము. ఆ తర్వాత కాసేపు మీ ఇంద్రజాల ప్రదర్శన కూడా యివ్వడానికి అంగీకరించాలి" అని కోరారు.




సరేనని మాటిచ్చి వాళ్లని సాగనంపాను.

సాయంత్రం 4 గంటలయింది. రవీంద్ర భారతి సుమారు 1500 మంది బాల బాలికలతో చాలా సందడిగా వుంది. పోటీలలో నెగ్గిన బాల బాలికలకు బహుమతి ప్రదాన మహోత్సవానంతరం నిశ్శబ్ద వాతావరణంలో నా ప్రదర్శన ప్రారంభ మయింది.

కాసేపు హస్త లాఘవ ప్రజ్ఞతో గాలిలోకి చేయిచాపి లడ్డు, జిలేబి అందుకుని బాల బాలికలకి పంచి పెట్టాను.

తర్వాత "పిల్లలూ మీ కందరికీ ఇప్పుడు ఆమ్లెట్ చేసి పెడతాను" అంటూ ఒక కోడి గ్రుడ్డు పగల గొట్టి స్టీలు భరిణలో మూతవేసి తీశాను.

అంతే! కోడి గ్రుడ్డు మాయమై, రెప రెప రెక్కలు కొట్టుకుంటూ ఒక తెల్లటి పావురం బయటపడే సరికి పిల్లలంతా కేరింతలు కొడుతూ గంతులేయడం మొదలెట్టారు అట్లా నా ప్రదర్శన పది నిముషాల సేపు జోరుగా సాగింది.

తర్వాత కొన్ని రబ్బరు బుడగలు చూపించి, 10, 15 బుడగలు ఊదిన తర్వాత వాటిలో ఒక నీలం రంగులో వున్న ఒక బుడగని తీసుకుని, అందరికి కనిపించేలా 1వ చిత్రంలో చూపిన విధంగా రెండు చేతులమధ్య బుడగని వుంచి–

వన్... టూ... త్రీ అని పెద్ద అట్టహాసం చేశాను– అంతే! ఆశ్చర్యం !!

చూస్తూండగానే నీలం బుడగ ఎర్రటి రంగులోకి మారిపోయింది.

ఆ మరుక్షణం బాలబాలికల చప్పట్లు, గంతులతో హాలంతా మార్మ్రోగిపోయింది.

నేను ప్రదర్శనకి ముందే నీలం రంగు బుడగలో ఎర్రరంగు బుడగ వుంచి, 2 వ చిత్రంలో చూపిన విధంగా వాటి మధ్యలో ఒక బియ్యపుగింజ వుంచి, రెండు చేతులతో బుడగని పట్టుకుని, బియ్యపుగింజని, వ్రేలి గోరుతో గీరడంవల్ల యింత హడావిడి జరిగిందని పాపం! ఆ పిల్లలకేం తెలుసు ?

గమనిక :– యీ ప్రదర్శనలో బుడగలు నాణ్యమైనవిగాను, పై బుడగ డార్కు కలర్‌లో వుండేలా ఎన్నుకొనడం చాలా ముఖ్యం — భావరాజు కామేష్.

---

ముక్కలు, ఆలుగడ్డ ముక్కలు వేసి కలపాలి. పూరీకూర మాదిరిగా గమనించవలసిన విషయం. పోపుచేసాక పొదీనా ఆకువేసి వేయించి, అప్పుడు వుడికిన కూర వేయాలి. తర్వాత మిర్చిముద్ద వేసి కలపాలి. గిన్నె దించి, మసాలా పొడి 1 స్పూన్‌వేసి కలిపి ఈ కూరను ఓ ప్రక్క వుంచండి తర్వాత పూరీని చేసి రెండు భాగాలు చేయాలి. ఒక్కొక్క భాగం 1 సమోసా అవుతుంది. అర్ధ చంద్రాకారంలో వున్న సగం పూరీలో ఈ కూర పెట్టి అటూ, యిటూ మడవండి త్రికోణ ఆకారంలా వస్తుంది. అలా అన్నీచేసి వుంచి, బాణలీలో నూనెపోసి కాగనిచ్చి తయారైన సమోసాలు వేసి దోరగా వేయించి తీయండి.

— శ్రీమతి సీతాలక్ష్మరాజ్



## వంటలు

### పెసరట్లతో కూర

కావలసిన వస్తువులు :– ¼ కిలో పెసరపప్పు (చాయది లేక పొట్టుది), 6 ఎండు మిరపకాయలు, ఉప్పు తగినంత, జీలకర్ర ఒక టీ స్పూను, ఒక కప్పు పుల్లటి పెరుగు లేక 50 గ్రా. చింతపండు, 50 గ్రా. నూనె, కొద్దిగా పసుపు, 3 టీ స్పూన్ల ధనియాలు, దాల్చినచెక్క చిన్నది, లవంగ మొగ్గలు 2, చిన్న అల్లంముక్క, నూనె 50 గ్రా, పచ్చిమిరపకాయలు 6, వెల్లుల్లి 2 రేకలు.

**తయారుచేయు విధానము :–** ఒక గంట ముందుగా పెసరపప్పును నానబెట్టాలి. పప్పు నానిన తరువాత శుభ్రముగా కడిగి, ఎండు మిరపకాయలు, తగినంత ఉప్పు, జీలకర్ర వేసి, మెత్తగా రుబ్బుకొనవలెను. రుబ్బిన పిండిని పలచగా పెసరట్లు వేయవలెను. వేసిన అట్లను మరీ చిన్నవిగా కాకుండా ముక్కలు చేయాలి. ధనియాలు, పచ్చిమిరప కాయలు, అల్లంముక్క, దాల్చిన చెక్క, లవంగ మొగ్గలు, వెల్లుల్లి, వీటిని అన్నింటిని మెత్తగా రుబ్బి పెట్టుకొనవలెను. బాణలిలో నూనెవేసి స్టౌవ మీద ఉంచాలి. నూనె కాగిన తరువాత రుబ్బిన మసాలాముద్దను బాణలిలో వేసి వేయించవలెను. పిమ్మట ముక్కలుగా చేసిన వి మూకుడులో వేసి పుల్ల పెరుగువేసి కొద్దిగా పసుపుకూడా వేసి కలియపెట్టి, మూత పెట్టవలెను. ఒకటి లేదా రెండు నిమిషాల తరువాత స్టౌవ్‌మీదనుండి దించవలెను. ఈ కూర అన్నంలో కలుపుకుని తింటే చాలా రుచికరంగా ఉంటుంది. పెరుగుకు బదులుగా చిక్కటి చింతపండు గుజ్జునుకూడా వేయవచ్చును.

—రావులపర్తి అనసూయ

**"అమ్మో! వస్తున్నోడు మాయదారి సచ్చినోడు" తుపుక్కున పళ్ల సందుల నుండి ఊసింది రంగమ్మ.**

కానిస్టేబుల్ రంగరాజు రంగమ్మపండ్ల బండి దగ్గిరికి వచ్చాడు చేతిలో వున్న లాఠీని ఊపుకుంటూ.

"ఏటి యాపారం బాగా జోరుమీద వున్నట్లుందే" వెకిలిగా నవ్వుతూ అన్నాడు.

"ఆఁ! ఏం యాపారం ఈరోజు అసలు బోణీకాలే" చిరాగ్గా ముఖం పెట్టి పండ్లను సర్దుకుంటూ అన్నది

"కబుర్లు సెప్పకు మామూలు ఇటులే. మన విషయం తెలుసుగా బండి వుండదు. యాపారం వుండదు" కోపంగా అన్నాడు రంగరాజు.

రంగరాజు కళ్లల్లోకి ఒక్క క్షణం తీక్షణంగా చూసి 'మాయదారి సచ్చినోడు' అని మనసులో తిట్టుకుని అర్ధరూపాయి తీసి చేతిలో పెట్టింది.

"యాపిల్ బాగా పండిందే" నవ్వుతూ వో కాయ అందుకుని ప్రక్కనున్న మరో బండివైపు నడిచాడు రంగరాజు

"ఊడి జిమ్మడ ఊడి చేతులు ఇరిగిపోనూ" మెటికలు విరిచింది రంగమ్మ.

అలా అందరి నోళ్లలో నానుకుంటూ మామూళ్ళు అన్నీ వసూలు చేసుకుని ఇంటి దోవ పట్టాడు రంగరాజు.

రంగరాజు వయస్సు నలభై వుంటుంది. మనిషి చాలా దృఢంగా కర్కశంగా వుంటాడు. మనిషేకాదు మాటకూడా కరుకే చిల్లర మల్లర దొంగతనాల కేసులు రంగరాజు పాలిట బడతాయి. రంగరాజు చేతిలో పడ్డవాడు మళ్లీ కొన్నాళ్లదాకా కోలుకోడు. అంత కఠినంగా ప్రవర్తిస్తాడన్నమాట. అందుకని రంగరాజంటే అందరికీ హడల్.

దారిలో వీరాసామి ఎదురయ్యాడు రంగిరాజుకు.

"ఏటి గురువా! ఈ యాళ ఏంత సంపాయించినావ్" నవ్వుతూ అన్నాడు ఈరాసామి.

"నా సంపాదన మాటకేంలే. నీ కాఫీ ఖర్చు అంత వుండదు. సాయిబ్బు సంపాదన బాబమ్మ కుట్టుపోగులకు చాలవన్నట్టు నా సంపాదన నా యింటిదాని రోగాలకు చాలటంలే. నీకేటి పెద్ద మార్కెట్ దగ్గర డ్యూటీ పడిందిగా – బోల్డు సంపాదన, చంపుకుంటున్నట్లున్నవ్" నవ్వుతూ బీడీ వెలిగించుకుని ఈరాసామికి ఒకటి ఇచ్చాడు.

"ఆఁ! ఏం సంపాదనలే ఇంటికాడ ఖర్చు లెక్కువయినయ్. నీకేటి తెల్సు నా కత నీవట్లాగే మాట్లాడతావ్." బీడీ వెలిగించుకుంటూ గునిసినట్లుగా అన్నాడు.

"మరి అలా సైదాబీ దగ్గిరికి ఎల్దామేటి. ఓ రోజు ఖర్చు లాగించవచ్చు"

"మరి ఆలస్యందేనికీ పద" ఇద్దరూ కూడబలుక్కుని బయలుదేరారు.

సందులు గొందులు దాటుకుంటూ ముచ్చటాడుతూ ఇద్దరూ ఊరిచివరకొచ్చి పడ్డారు

ఊరికి దూరంగా ఎవరో విసిరివేసినట్లు అక్కడొక పెంకుటిల్లూ దాని చుట్టూ ఓ పది గుడిసెలు. ఒక్కొక్క గుడిసెను దాటుకుంటూ బయలుదేరారు. రంగరాజు, ఈరాసామి రావటం చూసి అంతవరకు బయట నిలబడివున్న పడుచుపిల్లలు, పడుచు పిల్లల్లా కనబడటానికి సింగారించుకున్న ముసలి పడుచులూ లోపలికి చటుక్కున దూరారు. గుడిసెల్లోనుంచి బయటకురాబోతున్న విటులు తిరిగి గుడిసెల్లోకి జొర

# ఇదేం న్యాయం?






బిడ్డారు విళ్లిద్దరి కంట పడకుండా వుండే టందుకు.

ఈరాసామిని రంగరాజును చూసి అప్పటి దాకా బురదగుంటలో విహరిస్తున్న వో పంది బెదిరి వాళ్ల ప్రక్క నుండి పరు గెత్తింది.

అప్పుడే వో గుడిసెలో నుండి కండువా దులుపుకుంటూ వో ఆసామి బయటకు వచ్చాడు వెనుక వస్తున్న వీళ్లిద్దర్నీ చూడ లేదతను తాపీగా ముందుకు నడుస్తున్నాడు గబగబా వెళ్లి చటుక్కున ఆ ఆసామి చెయ్యి ఒడిసి పట్టుకున్నాడు రంగరాజు.

వెనక్కి తిరిగిన ఆ ఆసామి బెదిరి పోయాడు వీళ్లిద్దరినీ చూసి. అతన్ని చూసి వెకిలిగా నవ్వారిద్దరూ.

''మన ఊరు ఏది'' చిక్కగా నవ్వుతూ అన్నాడు రంగరాజు.

''ఈ... ఈ ఊరే!''

''ఆహా! అలాగ జెప్పు'' నవ్వాడు ఈరాసామి.

''జేబులో ఎంత వుంది'' అడిగాడు రంగరాజు.

వో రెండు రూపాయలు తీసి రంగరాజు చేతిలో పెట్టాడు ఆ ఆసామి. 'అలా దారికి రా' అన్నట్టుగా నవ్వి ''మరి నాకేది'' బీడీ వెలిగించుకుంటూ అన్నాడు ఈరాసామి.

ఈరాసామి చేతిలోకూడా వోరెండురూపా యలు పెట్టి కండువా దులుపుకుంటూ అక్కడి నుండి జారుకోబోయాడు ఆ ఆసామి.

''ఇదుగో మాట.''

రంగరాజు పిలుపు విని ఆగాడు.

''ఎప్పుడూ ఈసారి ఇటాక. కుళ్లి పోతావ్. ముందు డాక్టర్ కాడికి ఎళ్లు'' కరుగ్గా అన్నాడు రంగరాజు అతని వంక చూసి.

ఆ ఆసామి బ్రతుకుజీవుడా అనుకుంటూ అక్కడి నుండి చల్లగా జారుకున్నాడు.

ఇద్దరూ పెంకుటిల్లు ముందు ఆగారు.

దగ్గరగా వేసివున్న తలుపు విూద టక టక మనిపించాడు రంగరాజు.

''ఒసే! అరుంధతీ పాసింజర్లు వచ్చి నట్టున్నారు, తలుపు తీయ్'' మగాడి గొంతును మరిపిస్తున్న ఓ గొంతు ఖంగున మ్రోగింది.

''నీ యవ్వ. గుడిసేటి లం... పాసిం జర్లం కాదే, నీ రంకుమొగుళ్ళం వచ్చింది'' మనసులో అనుకున్నాడు రంగరాజు.

తలుపు తీసిన సుందరాంగి పాసింజర్లకు బదులు పాసింజర్లను కటకటాల వైపు నడిపించే డ్రైవర్లను చూడగానే బెదిరి తలుపు ప్రక్కకు గెంతింది.

ఇద్దరూ తలుపు తోసుకుని లోపలకి అడుగు పెట్టారు.

మంచంమీద కూర్చుని పొగాకు పాయలు విడదీస్తున్న ఓ భారీకాయం అదిరిపడింది వీళ్లిద్దరినీ చూసి.

''ఓ రంగరాజుగారా! రండి రండి మా ఇల్లు పావనం చేశారు. ఏటి ఈ మధ్య తమరి దర్శనం మాకు కలగటంలేదు. రండి కూర్చోండి'' నవ్వుతూ అన్నది తడబాటును కప్పిపుచ్చుకుంటూ.

''ఇదో సైదాబీ! నా దగ్గర నీ వగలు చెల్లవు. ఈయాళ నిన్ను బ్రోతల్ యాక్ట్ క్రింద బొక్కలోకి నెట్టబోతున్నాను. యస్. ఐ. గారు నిన్ను తీసుకురమ్మంటే ఇలావచ్చాం. నీ య్యాపారం ఈ రోజుతో సరి.''

''అయ్యో! అదేటి మా మీద మీకు శీతకన్ను పడ్డట్టుంది. మా బతుకులు మీ చేతిలో వున్నాయ్. మీ చెప్పులక్రింద బతికే దాన్ని, నా మీద అంత కోపం జేసుకోవటం న్యాయంకాదు... మన మాటకేటి లేండి. ముందు కాఫీ తెప్పిస్తాను. ఒసే కోటేశ్వరీ రెండు కాఫీ జరా తెప్పించు.''

''ఇదో కాఫీలేదు టోపీలేదు. ఇయేళ నీవు యస్. ఐ. గారిని కలవ్వలసిందే, స్టేషన్‌కి వచ్చితీరాల. ఈ సారి నీవు మమ్మల్ని ఎంత దువ్వినా లాభంలేదు మరి'' చిరాగ్గా అన్నాడు రంగరాజు.

''అబ్బో! అబ్బో! మరీ రంగరాజు గారికి కోపం ముక్కుమీదనే కూరు సుంటుంది'' వగలుబోతూ అన్నది సైదాబీ!

''కొత్త పిట్టలు నీ గూటికి ఏమన్నా వచ్చాయా!'' నవ్వుతూ అన్నాడు ఈరాసామి

''అలా అడిగారు బాగుంది. ఈమధ్నే ఒకటి వచ్చింది. మడిసి భలే వుంటది. కొత్తగా పెళ్లయింది. మొగుడు సన్నాసో డంట. సుఖం దొరక్క తపిస్తున్నది. ఈడకి వచ్చింది ఈ మద్దినే. పిలవ మంటారా.''

''ఇదో ఈరాసామి! నీవు గమ్మున వుండు ఇలాగే జెప్పిద్ది. మాటలు నమ్మి ఎళ్లినా వంటే కుళ్లిపోతావ్ ఆ.''

''అయ్యో! ఎంత మాట. మీకు అబద్ధం చెపుతానా. అలాంటిది నాకాడ ఒక్కటి కూడా లేదు నమ్మండి'' నమ్మకంగా అన్నది సైదాబీ.

''ఇట్టాగే నీవు చెప్పిన మాటలు నమ్మినా. ఏమైంది నాలుగు రోజులు కూ రోగం పుట్టింది ఆ చిలుం వదిలించుకోవ డానికి డాక్టరు కాడికి ఎళ్తే ఇంజెక్షన్ మీద ఇంజెక్షన్ పొడిచి మరీ డబ్బుగుంజాడు. అది సరే. ఏటి నీ విషయం తెల్చు తొందరగా'' కొద్దిగా కోపాన్ని మొహంలోకి తెచ్చి పెట్టుకుంటూ అన్నాడు రంగరాజు.

రొంటిలో నుండి రెండు పదులు తీసి రంగరాజు చేతిలో పెట్టింది సైదాబీ. ''ఇక మరి ఇంతే. బేరాలు అసలులేవు ఇంక నాకాడ చిల్లి ఏగానీ లేదు, ఆ తరువాత మీ ఇష్టం.''

''అంతేనంటావ్ మరి! సరే కానీ. వో పారి వచ్చి యస్. ఐ. గారికి కనిపించు ఈ

**'నా కవితా రహస్యం'**

దోమలన్నీ
దోమలే-
పాములన్నీ
పాములే-
నక్కలన్నీ
నక్కలే-
పులులన్నీ
పులులే...
కాని
మనుషు లందరు
మనుషులు కారు...
మనుషుల్లో
దోమలున్నారు
పాములున్నారు
గుంటనక్కలున్నారు
పెద్దపులులున్నారు...
మనిషిలో మనిషినే
చూపటం నా ఉద్దేశ్యం,
అదేనయ్యా నేస్తం
నా కవితా రహస్యం.

— రావి రంగారావు

## ఇదేం న్యాయం?

లోగా నేనేదో చెప్పి సర్దివుంచుతాలే. మరి వెళ్లి వస్తాం'' పడవలసింది చేతిలో పడగానే ముఖం ప్రసన్నం చేసుకుని అన్నాడురంగరాజు.

సైదాబీ దగ్గర మామూళ్లు వసూలు చేసుకుని ఇద్దరూ బయటకు వచ్చి పడ్డారు. రంగరాజు చేతిలోని ఇరవైలో నుండి వో పది ఈరాసామి జేబులోకి దూరింది.

సంజె చీకట్లు అలుముకుంటున్నాయ్. వాళ్లు ఆ ప్రదేశం వదిలి బయటపడేటప్ప టికి. స్ట్రీట్ లైట్లు వెలుగుతున్నాయి.

''గురువా కొద్దిగా మందు బిగిద్దామేటి'' పెదాలు నాలుకతో తడుపుకుంటూ అన్నాడు ఈరాసామి.

''సరే పద! కోటిగాడి దగ్గర నుండి ఈ మధ్య డబ్బు వసూలు కావటంలే. మందు బిగించినట్లు వుంటుంది కాసిని పైసలూ వచ్చినట్లుంటాయి. పద.''

ఇద్దరూ ఊరికి చివరగానున్న తాటితోపు వైపుగా నడిచారు.

వీళ్లను చూడగానే తోపులో గుడిసె వేసుకుని వ్యాపారం చేసుకుంటున్న కోటిగాడు పరుగెత్తుకు వచ్చాడు.

''రండి! చానాళ్లోజులయింది. మంచి ఇప్పసారా వుంది. ఇంతకుముందే కాపు దిగింది. కూకోండి'' అంటూ గుడిసె ముందున్న ఇరిగివున్న రెండు కుర్చీ బల్లలను సరిజేసి వాళ్ళిద్దరినీ కూర్చుండ బెట్టాడు.

''కల్తీ ఏమన్నా కలుపుతున్నావా'' రంగరాజు ప్రశ్నకు లేదన్నట్లుగా తల ఊపి ముంతలోనుండి వో రెండు గ్లాసుల్లోకి నిండా నింపి ఇద్దరికీ అందించాడు. విన యంగా. రెండు ఆకుల్లో చీకులు వుంచి వాళ్లముందర పెట్టాడు.

కోటిగాడి సేవలకు ఇద్దరూ తృప్తి చెంది వాడిదగ్గర మామూలు వసూళ్లు చేయకుండానే అక్కడనుండి కదిలారు

తోపు దాటేటప్పటికి బాగా చీకటి పడింది. రోడ్డుమీదకు వచ్చేసరికి ఇద్దరి బుద్ధులు క్రమేపి పనిచేయటం మాని వేశాయి. కోటిగాడు పోసిన ఇప్పసారా బాగా పనిచేయటం మొదలుపెట్టింది.

''ఇదో గురువా! నాబంలేదు. కాళ్లు తేలిపోతూ వుండాయి. మాటల సందట్లో పడి ఇద్దరం మరికాస్త బిగించినాం.

ఎక్కడో పడతాం. కొద్దిగా మందు దిగిన దాకా యాడన్నా కూర్చుందాం. ఏమంటావ్'' మత్తుగా అన్నాడు ఈరాసామి.

''నీవు చెప్పేది కరెక్టే'' తల విదిలిస్తూ అన్నాడు రంగరాజు.

ఇద్దరూ అక్కడేవున్న వో చెట్టు మొదట్లో కూలబడ్డారు. ఆ ప్రదేశం ఊరికి చివరగా వుండటంతో జన సంచారం ఏమాత్రం లేదు. ఇదరూ తలలు విచిత్రంగా కదిలిస్తూ చెట్టుకు ఆనుకుని బీడీలు వెలిగించారు.

''ఇందాక స్పైదాబీ చెప్పలా ఏదో కొత్త పిట్ట వచ్చిందని వ్! ఇప్పుడనిపిస్తున్నది. ఓ చూపు చూసినా బాగుండేదని'' మందు మత్తెక్కిస్తుంటే ఒళ్ళు విరుచుకుంటూ అన్నాడు ఈరాసామి.

నవ్వాడు రంగరాజు ''మరి ఇందాక మందులేదు. పొందు కావాలంటే ఆడనే వుందాయె ఇప్పుడు మందు ఎక్కింది. ఇప్పుడు ఆడదాకా ఎట్టాగా ఎల్లలేం మడిసిజనమకు ముఖ్యంగా మందు దానితో పొందుకావాలి. ఏమంటావ్'' నవ్వుతూ అన్నాడు రంగరాజు తల విదిలించుకుంటూ.

''అబ్బ! ఎంత గొప్పగా జెప్పినవ్ సురూ! అదిసరే కైమెంతవుద్ది.''

''ఎంతోనా! చాలా తక్కువ అయిద్దిలే.. అదేదో రిక్షా వస్తుంది. ఎవురో అది...''

''ఆపించఘంటావా'' రొమ్ము గాలిలోకి ఎక్కుపెట్టి రీవిగా అన్నాడు ఈరాసామి.

''ఆలస్యం చేయకుమరి. రిక్షా దాటేసిద్ది. ఏదన్నా బేరం తాలూకేమో చూద్దాం'' చెట్టును ఆధారంగా చేసుకుని లేచి నిలబడ్డాడు రంగరాజు.

తూలుకుంటూ రంగరాజుకంటే ముందు నడిచాడు ఈరాసామి. రిక్షా దగ్గరిగా వచ్చి ఈరాసామిని చూసి చటుక్కున ఆగింది.

''ఎవరూ రిక్షాలో...'' కళ్ళు చికిలించి చూస్తూ అన్నాడు ఈరాసామి.

ఆ సరికి రంగరాజు రిక్షాదగ్గరికివచ్చాడు.

''వోరి మూగినాయాలా! నీవటూ రిక్షా తొక్కేది.'' రంగరాజు అన్నాడు రిక్షా వాడితో.

అవునన్నట్లుగా తల ఊపాడు వాడు.

''వోరు రిక్షాలో మడిసి'' అన్నాడు రంగరాజు రిక్షాలోనికి తొంగిచూస్తూ.

'' ఆడమడిసలే వుంది '' అన్నాడు ఈరాసామి

''దేనికి రిక్షా ఆపించారు''ఆశ్చర్యపోతూ అన్నది రిక్షాలోని స్త్రీ.

''ఎవరునువ్వు యాడనుండి వస్తున్నావ్'' కరకుగా అన్నాడు రంగరాజు.

''నా పేరు ఆదెమ్మ. మా మావకు మిర్చి యార్డులో పని. అన్నమిచ్చి వస్తూండ. అదిసరే రిక్షా ఎందుకు ఆపినారు'' అమాయకంగా అడిగింది ఆ స్త్రీ.

''గుంట కు అదే'' ఈరాసామి రంగరాజు చెవిలో గొణిగాడు.

''దిగు''కర్కశంగా అన్నాడు రంగరాజు.

''దేనికి'' భయం భయంగా అన్నదామె.

''ఇవరాలు తరువాత, ముందు దిగు'' మత్తుగా అన్నాడు రంగరాజు.

''నేను దిగను''బెదురుతూ అన్నది ఆ స్త్రీ

''దిగవేనంజా! తిక్కరేగిందాకా సేయకు'' చెయ్యిపట్టుకుని చటుక్కున క్రిందకు లాగాడు రంగరాజు.

''వోయమ్మో! నన్ను సంపేత్తున్నారు'' పెద్దగా కేకపెట్టింది. నోరు మూశాడు రంగరాజు.

''అరిచావా చంపేస్తా పద'' అంటూ చటుక్కున రోడ్డువారగా వున్న ఒక చేను లోకి లాక్కునివెళ్ళాడు.

అప్పటిదాకా ఆశ్చర్యంగా చూస్తున్న రిక్షావాడు పులిలావచ్చి రంగరాజు చెయ్యి పట్టుకున్నాడు.

అంతే! ఈరాసామి చేతిలోవున్న లారీ వాడి తలమీద నాట్యంచేసింది. ఆ దెబ్బలకు కుప్పలా కూలిపోయాడు వాడు.

''గురువా పని ముగించుకుని రా! జరా కానీ'' ఈరాసామి చుట్టుపక్కల కలియ జూస్తూ అన్నాడు.

రంగరాజు చేతిలో గింజుకుంటున్నది ఆ స్త్రీ. అఱవటానికి అవకాశం లేకుండా చేత్తోటి నోరుమూసి ప్రక్కనేవున్న పొలం లోనికి గుంజుకు వెళ్ళాడు.

కొద్దినిముషాలు యుగాల్లా గడిపాడు ఈరాసామి రోడ్డుమీద.

రంగరాజు గబగబా వచ్చాడు ''తొందరగా పని ముగించుకురా'' అంటూ బీడి ఒకటి

## రచయితలకు మనవి

కార్టూన్‌లతోను కథలతోను స్వంత చిరునామాగల స్టాంపులంటించిన కవరులు జతపరచకపోతే వాటిని త్రిప్పిపంపటం సాధ్యంకాదు. సం



## ఇదేం న్యాయం?

వెలిగించుకుని రోడ్డుమీదకు వోసారి దృష్టి నిల్పి ఆ తరువాత రిక్షావాడి వంక చూసి తనలో అనుకున్నాడు 'వీడు ఇప్పట్లో కదలడని.'

హుషారుగా పొలంలోనికి దూరాడు ఈరాసామి. అట్లా వెళ్లిన వాడు ఇట్లా పరుగెత్తుకు వచ్చాడు ఆదుర్దాగా.

"గురువా అది కదలడం లేదు. నా కేదో అనుమానంగా వుంది."

"ఏటి నీ వనేది" చిరాగ్గా అన్నాడు రంగరాజు.

"అది కదలటం లేదు. చచ్చిందానల్లా పడివుంది."

ఈరాసామి మాటలకు అదిరిపడ్డాడు రంగరాజు.

ఈరాసామితో పాటు రంగరాజు కూడా ఆ చీకట్లో ఆ స్త్రీ దగ్గర చేరాడు.

ముక్కు దగ్గర గుండెమీద చెయ్యి వుంచి చూశాడు రంగరాజు.

"ఇది చచ్చింది" అన్నాడు రంగరాజు గాబరాగా.

"ఎట్లా" బెరుగ్గా అన్నాడు ఈరాసామి

"ఇందాక ఇది వోమారు కేక పెట్ట బోయింది. దాని గొంతు గట్టిగా పట్టు కున్నా చస్తుందనుకోలేదు."

"ముందు ఇక్కడినుండి బయటపడదాం భయం భయంగా అన్నాడు ఈరాసామి."

పరుగెత్తుకుంటూ ఇద్దరూ రోడ్డు మీదకు వచ్చారు.

"వీడు మనల్ని గుర్తు పట్టాడు. అందు కని వో పని చేద్దాం. కేసు వీడిమీదకు నెడితే సరి. ఏమంటావ్" స్థిమితంగా గాలి పీల్చుకుంటూ అన్నాడు రంగరాజు.

"ఎట్లా."

"చెబుతాను జాగర్తగా విను."

* * *

ఓ ఆరు నెలల తరువాత కానిస్టేబుల్ రంగరాజు హెడ్ రంగరాజు అయ్యాడు. అంత తొందరగా హెడ్ గా వటానికి కారణం ఒంటరిగా వున్న వో స్త్రీ మీద రిక్షావాడు ఒకడు అత్యాచారం జరిపితే సమ యానికి అటుగా వెళ్లి నిందితుని పట్టు కున్నందుకు అతనికి ప్రభుత్వం ప్రమో — షన్ ఇచ్చింది.

## మధువులేని ఆహ్వానానికి ఇద్దరే హాజరు !

వాషింగ్టన్‌లో భారత రాయబారిగా నియమింప బడిన ప్రఖ్యాత న్యాయవాది పాల్కీవాలా పత్రికా విలేఖరులను ఆహ్వానించారట. ఆయన 39 మంది పత్రికా విలేఖరుల నాహ్వానిస్తే ఒక ఇద్దరు మాత్రమే హాజరయ్యారట. వారిరువురూ భారత దేశంలోని ఇంగ్లీషు పత్రికల విలేఖరులట. దీని కారణం ఏమిటయ్యా అంటే ఆ ఆహ్వానంలో మధువు ఇవ్వబడదు, టీ మాత్రమే ఇవ్వబడును అని ప్రింటు చేయించారట పాల్కీవాలా.

## ఆయుర్దాయం పెరిగే చిట్కాలు !

వివాహం చేసుకోడం, పిల్లలను కనడం, ఎత్తయిన ప్రదేశాలలో నివాస ముండడం, మోతాదు మించకుండా ఆహారం తీసుకోడం, మాతిలో నీళ్ళు త్రాగడం మొదలైనవి మనుష్యుని జీవిత కాలాన్ని పెంచుతాయని రష్యను విజ్ఞాన వేత్తలు అభిప్రాయ పడ్డారట.

## కక్ష తీరడానికి చెవి తెగ్గోసిన దంపతులు !

చిన్నపురికి చెందిన ఉత్తంకర్రై అనే వూరిలో 21 ఏళ్ళ ఆదిమూలం అనే అతనికి, ఆతని భార్య మారియమ్మకూ అదే వూరుకు చెందిన గోవింద సామి అనే ఒక వ్యవసాయదారులో పొలం విషయం తగాదా వచ్చి, అది ఎక్కువై కక్షగా మారిందట దాంలో నిద్ర పోతున్న గోవిందస్వామి ఇంటికి ఆదిమూలం, ఆతని భార్య వెళ్ళి క్షవరం కత్తితో ఆతని ఎడమ చెవి కోసేశారట. ఆ చెవి పుచ్చుకు పరుగున మారియమ్మ ఇంటకొచ్చేసిందట

## భార్యాబిడ్డల్ని బలి తీసుకున్న ఆలుమగల కలహం !

పిరప్పాళయం అనే వూరిలో మునుసామి అనే ఆతనికి, ఆతని భార్య సాలమ్మకి అను నిత్యం పోట్లాటేనట. మొదట్లో ఎంతో అన్యోన్యంగా వున్న ఆ దంపతులిద్దరూ రాన్రానూచిన్న ప్రతివిష యం మీద గంటల తరబడి పోట్లాడుకునేవారట. సాలమ్మ ప్రతి పోట్లాటయ్యాక, తన మూడేళ్ళ కొడుకును ఒడిలో పెట్టుకుని వలవలా ఏడ్చేదట పోయిన నవంబరు 29 వ తేదీరాత్రి పోట్లాట య్యాక అలా ఏడవకుండా హాయిగా పడుకుందట తెల్లారేకచూస్తే ఆమె, పసిపిల్లాడు కూడా లేరట. వూరంతా వెతికిన మునుసామికి నా పొలంలోని మాతిలో వారిద్దరి శవాలూ దొరికాయట.

## రష్యాలో తగ్గిపోతున్న మగవాళ్ళు !

రష్యాదేశంలో మగవారికన్నా ఆడవారు రెండు కోట్లు అధికంగా వున్నట్లు కూడి జనాభా లెక్కలు తెలియజేశాయట. అదీ గాక, వున్న మగ వారిలో చాలా మంది నపుంసకులట. ఇంతాచూసి బాబోయ్, ఇట్లే పరిస్థితిలో కొన్నాళ్ళకు ఈ దేశంలో జనాభా తగ్గిపోయి జనులు కావాలిబాబో యని గోలపెట్టే స్థితి వస్తుందేమోనని ఆ దేశం చాలా భయపడుతోందట.



## తగిన ఉద్యోగం వచ్చేదాకా దొరికిందాంతో తృప్తి

ఢిల్లీలో సతీష్ అనే అతను, కోహ్లి అనే ఆతను ఇరవైయ్యయిదు వేల రూపాయలు ఖర్చు పెట్టి విమాన చోదకవిద్య నేర్చుకుని, అనక భారత ప్రభు త్వానికి దరఖాస్తు పెట్టుకుంటే ఆ వుద్యోగం లభించలేదుట. దానికి వారుకిమాక సహించక 1970 నుంచి ఢిల్లీ విమానాశ్రయంలో పోర్టర్ల సామాన్లు మోసేవారుగా పని చేయనారంభించా రట. వారిద్దరికి పోయిన జులైలో పైలట్‌వుద్యో గాలు దొరికాయట— పోన్లెండి పాపం!!

## పుట్టబోయే బిడ్డ ఆడా ? మగా ?

స్త్రీ గర్భిణి అయిన ఏడెనిమిదో వారంలో గర్భంలో వున్నది మగా, ఆడాఅనే విషయం అతి సునాయాసం గానే కనుక్కొనే సాధనం చైనా దేశ విజ్ఞాన శాస్త్రం కనుగొన్నదట— ఏమిటది చెప్మా. ఇంకా అది చెప్పలేదు వారు.

## శివుణ్ణి లొంగదీసిన రమణి !

పాల్ఘాచిలో నా సర్కస్ ఏనుగును దాని మావటి వాడు వూరిలో నా రవుండు తిప్పి నా చోటస్నానం చేయిస్తుండగా ఈ ఏనుగు తొండం ఎత్తి చిప్పున మావటీడు మీద నీళ్ళు చిమ్మి, స్వేచ్ఛ ప్రకటించి గునగునా వూరిలో వచ్చేసి, రాజవీధులన్నీ తిరగ నారంభించిందట. వూరిలో వారందరు జిలార్చుకు పోయికిటికీల్లోంచి కూడా చూడ సాహసం లేక అట్టేవుండి పోయారట. ఈ సంగతిసర్కసు వాళ్ళకు తెలిసి, 15 ఏళ్ళ శివ అనే ఆ ఏనుగు ప్రియురాలు 14ఏళ్ళ రమణిని తీసుకుని వెంట పడ్డారట. షుమారు ఐదు గంటలు స్వేచ్ఛగా తిరిగిన మీదట ఏనుగు తన ప్రియురాలి వెంట బయల్దేరి సర్కస్ గుడారానికి వెళ్ళిపోయిందట. ఆ ఏనుగు ఎవరికీ హానికలిగించలేదట.

## ఖైదీలకు వారానికో సినిమా !

అంపోరా అనే దేశంలోని ఒక చెరసాలలో కేవలం ఇద్దరు ఖయిదీలు మాత్రమే వున్నారట. వారిద్దరూ ప్రతి శనివారం వరుస తప్పక సినిమాకి వెళ్ళి వచ్చే ఏర్పాటు వారిష్టం మేరకు ఆ జైలు అధికారులు కలుగజేస్తున్నారట— ఇంటికన్నా కూడి పదిలమున్నారందుకే.

## పశ్చిమజర్మనీ మహిళల పైచేయి !

పశ్చిమ జర్మనీలో మగవారు చేసే ప్రతి వుద్యోగానికి పనికి ఆడవారు పోటి పడుతున్నారట. అక్కడ జీతంలో గాని, కూలీలో గాని ఆడ మగాలకు తేడా లేదట. చివరికి క్రేన్ డ్రయివింగుకు కూడా ఆడవారు తయారవుతున్నారట. మరీ పోటీ ఎక్కు వంతే ఇహ మగవారు నలభీముల్ని తల్చుకో వాలికా వోల్సు.

**కాంకర్డ్ పై సుప్రీంకోర్టు తీర్పు !**

న్యూయార్క్ విమానాశ్రయంలో గత ఏడేళ్లుగా కాంకర్డ్ విమానం దిగరాదని నిషేధించారట. ఆ విమానం అధిక శబ్దం చేస్తుందన్న ఒకే కారణాన్ని సుప్రీంకోర్టు కొట్టివేసి మరేమీ ఫరవా లేదు, ఇకమించి విమానం దిగవచ్చు అని తీర్పు చెప్పిందట.

**టాక్సీ బాడుగకు బదులు చూయింగ్‌గమ్ !**

మాస్కోలో టాక్సీ డ్రయివర్లు బయట దేశాల నుంచి వచ్చిన వారు తమ టాక్సీలలో ప్రయాణం చేశాక బాడుగకు బదులు చూయింగ్ గమ్ (పిల్లలకు నమిలేందుకు ఓ రకం రబ్బరులా సాగే మిఠాయి వంటిది.) అడిగి తీసుకుంటున్నారట.

**పెరిగిన ఋణభారం!**

1974 లో మనదేశం అన్యదేశాలనుంచి అప్పులుగా తీసుకున్న ఋణాల మొత్తం పదకొండున్నర మిలియను డాలర్లట. అది 1976 నాటికి 15 మిలియనుడాలర్లుగా అభివృద్ధి చెందిందని తత్సంబంధమైన శాఖవారు ఓ ముఖ్యప్రకటన చేశారట

**ప్రాణానికి ముప్పుతెచ్చిన అలుక !**

కృష్ణగిరికి చెందిన 25 ఏళ్ల రామచంద్రను కాపణిక్కివాయిత్తు గ్రామానికి చెందిన 23 ఏళ్ళ కాత్తాయి అనే అమ్మాయికి మూడేళ్ల క్రితమే వివాహమయ్యిందట. పెళ్ళయిన లగాయితు కాత్తాయి భర్తతో దెబ్బలాడుతూ పుట్టింటికి పోతూండేదట. అతను ఓపిగ్గా వెళ్ళి తీసుకొచ్చేవాడట. ఓ నాడలాగే అలిగి వెళ్ళిన ఆమెను తీసుకు రాడానికి రామచంద్రన్ అత్తారింటికి వెళ్తే ఆమె యిక చస్తే రానందట. దానికామె తలిదండ్రులు కూడా వంతపాడారట. దాంతో రామచంద్రనుకి ఆవేశం వచ్చి చేతికందిన కొడవలితో కాత్తాయిని నరికి చంపేశాడట.

**దొంగ బిల్లులతో లక్షలు స్వాహా చేసిన సహోదరులు !**

పూనేకు చెందిన జనతాపార్టీ ఎమ్మెల్సీ సంజాబి రావ్ కాక్డే అనే ఆయన, ఆయన తమ్ముడు, మరో ఇద్దరూ అబద్ధపు బిల్లులు చూపించి, 45 లక్షల 46 వేల రూపాయలను గల్లంతు చేశారన్న నేరం మీద అరెస్టయ్యారట — దట్సిట్!

**సైకిళ్లను దొంగిలించిన డాక్టర్ !**

నామక్కల్‌కు చెందిన సేందమంగలం అనే వూరిలో మొన్న 2 వ తేదీ రాత్రి అబ్దుల్ రహమాన్ అనే హెూవి యోపతి డాక్టరుగారో సైకిలు మీద పోతుంటే బీటు కానిస్టేబుల్స్ ఆయన్ని ఆపి, యింత అర్ధరాత్రి ఎట్నుంచి వెళ్తున్నారేసార్! ఏమా విషయం అని దబాయిస్తే సమాధానం దొరక్క చిందులు తొక్కాడట. మామూలుగా అడిగితే యిలా భరతనాట్యమాడతాడేమా అనిసందేహపడి స్టేషనుకు తీసుక పోయి విచారిస్తే ఆ డాక్టరుగారా సైకిలు దొంగతనం చేసి తీసుకు పోతున్నట్టు తెలిసిందట. ఆయన వంత క్రితం దొంగతనం చేసి, జాగ్రత్త చేసుకొన్న మరో రెండు సైకిళ్ళ కూడా ఆయనింట్లో దొరికాయట— అ!రె! ఎవ్వప్పు యిదెల్లాం?

**క్వార్టర్స్ కోసం ఎం ఎల్.సీ.ల సత్యాగ్రహం**

పాట్నాలో రాష్ట్ర అసెంబ్లీ స్పీకరు చాంబరు ఎదురుగా యిద్దరు జనతా ఎమ్మెల్సీలు తిష్టవేసుక్కూర్చుని రాష్ట్ర కేంద్ర పట్టణంలో తమకు వుండడానికి ఎమ్మెల్సీ క్వార్టర్స్ లేవని, అవి యిచ్చే వరకూ లేచేదిలేదనీ ప్రకటించారట. వారిద్దర్లో ఒకాయన చాప వరుపు కూడా తెచ్చుకుని స్పీకరుగారి గదిగుమ్మానికడ్డంగా వేసుకుని పడుకున్నారట. ●



# అవీ-ఇవీ-అన్నీ

### హితోపదేశః

### ప్రస్తావికా — మిత్ర లాభములు

టీకాది ప్రణేత శ్రీ ఎస్. వి. కె. సుబ్బరాజు. సులభ టీకా తాత్పర్య సహితంగా వున్న యీ గ్రంథం ద్వితీయ ముద్రణ మా కార్యాలయం చేరింది. పుటలు : 193, మూల్యము ఎనిమిది రూపాయలు, ప్రతులకు : విద్యానిలయ ప్రచురణలు, కేరాఫ్ డి. ఎన్. ఆర్ కాలేజీ స్టాఫ్ క్వార్టర్స్, భీమవరం 534 202

### అనల కిరీటం

కవితా సమాహారం. రచన : శ్రీ సోమసుందర్. 100 పేజీలు, వెల : 5 రూపాయలు. ప్రతులకు: 1 విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ—2. 2 ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, సికింద్రాబాద్. 3. కళాకేళి పబ్లికేషన్స్, పిఠాపురం — 533 450. తూ. గో. జిల్లా.

### రేపటి మనిషి

వచన కవితాసంపుటి. రచన : శ్రీ టి. గౌరీశంకర్ 72 పేజీలు, వెల : మూడు రూపాయలు. ప్రతులకు : రచయిత పేర ఇం. నెం. 1—8—78/79, చిక్కడపల్లి, హైదరాబాదు—500 020. లేదా శ్రీవర్స్ ఫ్రంట్, యం. యస్., — 19, మలక్‌పేట, కాలనీ, హైదరాబాదు— 500 036 కు వ్రాయాలి.

### సమాలోచన

జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక. సంపాదకులు విద్వాన్ బులుసు సీతారామ శాస్త్రి, విడిప్రతి వెల 50 పైసలు చిరునామా శ్రీ బులుసు సీతారామ శాస్త్రి, సంపాదకుడు, 6—8—7, ఇన్నీసుపేట, రాజమండ్రి—1.

### శేషేంద్రజాలం

పరిశీలనాత్మక విమర్శ. రచన : శ్రీ అవంత్స సోమసుందర్, 154 పేజీలు, వెల : నాలుగు రూపాయలు ప్రతులకు : 1. ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, 3237 రాష్ట్రపతిరోడ్డు, సికింద్రాబాదు. 2. సి. ఎల్. ఎస్. బుక్‌షాపు, నాంపల్లి స్టేషన్ రోడ్డు, హైదరాబాదు. 3. కళాకేళి, పిఠాపురం తూ. గో. జిల్లా.

## ఖరగ్‌పూర్‌లో సిల్వర్‌స్టార్ మిమిక్రి

అనేక రాష్ట్రాలలో ఇప్పటికి 1550 ప్రోగ్రామ్స్ ఇచ్చిన సిల్వర్‌స్టార్ మిమిక్రీ కార్యక్రమం ఖరగ్‌పూర్ దుర్గామందిరంలో నవంబర్‌లో జరిగింది. ప్రవాసాంధ్ర నవ్య కళా పరిషత్తు వారు ఏర్పాటు చేసిన సినీగాయకుడు శ్రీ జి. ఆనంద్ స్వర మాధురి కార్యక్రమంతో ఇక్కడికి వచ్చారు. సిల్వర్‌స్టార్ వివిధరకాల ధ్వన్యను కరణలతో శ్రోతల్ని విశేషంగా ఆకర్షించారు. సినీ నటుల కంఠాలు మాత్రమే కాకుండా వారి మేనరిజమ్స్ కూడా ఇమిటేట్ చెయ్యడంవల్ల వాటికి పెర్‌ఫెక్షన్ వచ్చింది. వెంట్రిలా క్విజమ్ స్టైల్‌లో చేసిన రైతింజను చప్పుడు, ఆంగ్ల సంభాషణలు బాగా ఆకట్టుకున్నాయి. పైన ఫోటోలో కూర్చున్నవారు సిల్వర్‌స్టార్ ప్రక్కన సనారా.

## ఉత్తరాలు

(5 వ పేజీ తరువాయి)

నటి శుభ ముఖచిత్రంతో వెలువడిన మీ(మా) ఆంధ్రపత్రిక మనోరంజకంగా వుంది. రాగబంధం సీరియల్ ముగింపు చాల బాగుంది. రచయిత సరోజినీ దేవిగార్కి అభినందనలు. జి. వి. జి. గారి పేజి బాగుంది.

టి. ఇ. విజయలక్ష్మి (ద్రోణాచలం)

* * *

ఈ వారం చిన్న సీరియల్ సి.ఏ. హిమబిందు ప్రారంభంలోనే చాలా గొప్పగావుంది. ముందుముందే మవుతుందాన్న ఉత్కంట చాలా ఎక్కువగా వుంది.

యం. అనూరాధ (పిలారు)

### సినిమా

23—12—77 కవిత ముఖచిత్రంతో వెలువడిన పత్రికలో సమాప్తమైన జీవనపోరాటంలో ఆశలఆరాటం ముగింపు మాకు తృప్తి నివ్వలేదు. అదే పత్రికలో మొదలైన సి. ఏ. హిమబిందు మొదట్లోనే మమ్మల్ని ఆకట్టుకుంది. మద్రాస్ సినిమా న్యూస్ లేకపోయినా ఆ వెలితి పాఠకులకు కనపడనీయకుండా ఎప్పటిలాగే పాఠకులకు చక్కని న్యూస్ అందించారు. అందుకు అభినందనీయులు.

డి. ఉదయకుమార్, [ కుర్దారోడ్, ఒరిస్సా.]

* * *

సినిమా శీర్షికలో శ్రీనివాస్, రాజేంద్రప్రసాద్ తో జరిపిన ఇంటర్వ్యూ బాగానే ఉంది. ఇంక సినిమాలో శ్రద్ధ తీసుకుంటే బాగుంటుంది. ఈ గాలిలో దెయ్యాలు ఉన్నాయి కథబాగుంది. కాని ఆఖరున ఏమీ బాగలేదు. రాగబంధం సీరియల్ హాస్యం కాస్త ఎక్కువఅవుతుంది. జీవన పోరాటంలో ఆశలఆరాటం సీరియల్‌లో క్రితంవారం ప్రచురించిన బొమ్మనే యీవారం కూడా ప్రచురించారు. ఇదొకటి తప్పు.

పాలక్కాని డైరీ లో ఎంతసేపు తమిళనాడుకు చెందిందే వేస్తారు. కాని ఆంధ్రకు చెందింది ఒక్కటి కన్పించదు.

కె.సాంబకుమార్, (విశాఖపట్నం.)

* * *

ఎన్ని ఉత్తరాలు వ్రాసిన పత్రికలో మా ఉత్తరాలు వేయకపోవటం క్రొత్తవారికి అవకాశంలేదేమో అని భావిస్తున్నాము. కాని, ఈ ఉత్తరం వ్రాయకుండా యుండలేక పోతున్నాము. 25.11.77 కృష్ణంరాజు ముఖచిత్రంతో వెలువడిన మా (మీ) పత్రిక యింక చాల బాగుంది.

గొర్రె అనసూయదేవి, బుద్ధన వెంకటలక్ష్మి (మచిలీపట్నం.)

* * *

పర్వీన్ బాబి ముఖ చిత్రంతో వెలువడిన 4—11—77 మీ (మా) పత్రిక చాలబాగుంది ముఖ్యంగా కాక్ టెయిల్ కథ చాల బాగుంది. కార్టూనులు ఇంకా ఎక్కువగా ప్రచురించగలరు. జీవన పోరాటంలో ఆశల ఆరాటం సీరియల్ చదువుతుంటే మళ్లీవారం పత్రిక ఎప్పుడువస్తుందా అని మా మనసులు ఆరాట పడుతున్నాయి.

ఏ. వి. వెంకటరావు (భద్రాచలం)

Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3 Editor: S. Radhakrishna

